# భాషాశాస్త్రము



రచన:

జె. వి. స్టాలిన్

అనువాదం:

కాట్రగడ్డ రాజగోపాలరావు



విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ

ప్రచురణ సెం. 35

ప్రథమ ముద్రణ
జులై '53

# పన్నెండణాలు

సాహితీ ప్రెస్
విజయవాడ - 2.

# పరిచయం

"భాషాశాస్త్రం" అన్న గ్రంథంలో "మార్క్సిజం-భాషాశాస్త్రాల సమస్య"లను కామ్రేడ్ స్టాలిన్ చర్చించాడు. ఈగ్రంథంలో మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని కామ్రేడ్ స్టాలిన్ మరింత పెంపొందించాడు. సామాజిక శాస్త్రాల్లో లాగానే భాషాశాస్త్రంలో కూడా మార్క్సిజానికి ప్రత్యక్ష సంబంధంవున్నందువలననే తనకూ ప్రత్యక్షసంబంధం ఏర్పడిందని కామ్రేడ్ స్టాలిన్ ఇది వ్రాస్తున్న సందర్భంలో తెలియజేశాడు.

సమాజం పరివర్తన చెందుతున్నకాలంలో ఆయా దశలలోని ఆర్థిక విధానాన్ని పునాది అంటారు. దానిననుసరించి ఏర్పడే రాజకీయ, సామాజిక భావాలు మొదలైనవి ఆ పునాదిపై ఏర్పడే "కట్టడం" అవుతుంది. అలాగే భాషకూడ ఒక "కట్టడం" అని అనడం సరియేనా? భాష అనేది ఏ ఒక్క ప్రత్యేకవర్గ అవసరాలను మాత్రమే తీరుస్తుందా? సంస్కృతీ, భాషా, రెండూ ఒకటేనా? సంస్కృతిలో బూర్జువా, సోషలిస్టు అనే భేదాలున్నట్లు, భాషలోకూడా భేదాలున్నాయా? భాషకు వుండవలసిన విశిష్ట లక్షణాలేమిటి? మొదలైన సమస్యలపై భాషాశాస్త్రజ్ఞులలో ఇదివరలో ప్రబలివున్న అపోహలను కామ్రేడ్ స్టాలిన్ పోగొట్టాడు.

ఇది ఒక భాషాశాస్త్రానికి సంబంధించిన గ్రంథమైనా, మార్క్సిజం-లెనినిజం అనే సిద్ధాంత సంపదను వృద్ధిచేస్తుంది.

సిద్ధాంతమూ ఆచరణా అవిభాజ్యమనీ, శాస్త్రీయవిషయాలను నిర్మాణాత్మకంగా పరిశీలించాలనీ, కామ్రేడ్ స్టాలిన్ తెలియజేశాడు. మార్క్సిజం సర్వకాల సర్వావస్థలకు ఒకే రకమైన ఛాందసమైన సూత్రీకరణలు చేస్తుందనే దురభిప్రాయాన్ని కామ్రేడ్ స్టాలిన్ ఈ గ్రంథంద్వారా ఖండించాడు.

మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానాభిలాషులకేగాక, భాషా శాస్త్రాభిరుచి కలవారందరికీ ఈ గ్రంథాన్ని అధ్యయనం చేయడం ఎంతో ఉపకరిస్తుందని ఆశిస్తున్నాం.

— ప్రకాశకులు.

# భాషాశాస్త్రం

భాషాశాస్త్రానికీ, ప్రత్యేకంగా, భాషా శాస్త్రంలో మార్క్సిజానికీ సంబంధించిన సమస్యలపై నా అభిప్రాయాన్ని పత్రికాముఖంగా వెలువరించవలసిందని కొంతమంది కామ్రేడ్సు కోరారు. నేను భాషాశాస్త్ర కోవిదుణ్ణి కాకపోవడంచేత, బహుశా ఆ కామ్రేడ్సుని సంపూర్ణంగా సంతృప్తిపరచలేను. అయినా యితర సామాజిక శాస్త్రాల్లో లాగానే భాషా శాస్త్రంలో కూడ మార్క్సిజానికి ప్రత్యక్ష సంబంధం వుండటంవల్ల నాకూ ప్రత్యక్ష సంబంధ మున్నది. అందుచేతనే కామ్రేడ్సు అడిగిన అనేక ప్రశ్నలకు సమాధాన మివ్వడానికి వొప్పుకున్నాను.

ప్రశ్న :—భాషను పునాదిమీది కట్టడమనటం సరైనదేనా ?

జవాబు:—కాదు; ముమ్మాటికీ కాదు.

సమాజం అభివృద్ధి పొందుతూ వున్నప్పుడు ఆయా ప్రత్యేక దశల్లో వుండే సామాజిక ఆర్థిక విధానం పునాది అవుతుంది. రాజకీయాలకు, న్యాయ శాస్త్రానికి, మతానికి, కళకు, తత్వశాస్త్రానికీ సంబంధించిన సామాజిక భావాలు,

వీటికి సంబంధించివుండే రాజకీయ సంస్థలు, న్యాయవ్యవస్థలూ వగైరా కట్టడం అవుతాయి.

ప్రతిపునాదికీ దానికి తగినకట్టడం వుంటుంది. ఫ్యూడల్ విధానం యొక్క పునాదికి దానికనుగుణమైన కట్టడం వుంది. ఫ్యూడల్ రాజకీయాలు, ఫ్యూడల్ చట్టాలు వగైరా అవే. అలాగే పెట్టుబడిదారీ పునాదికీ, సోషలిస్టు పునాదికీ కూడ వాటి కనుగుణమైన కట్టడాలున్నాయి. ఆ పునాదిని మారిస్తే కట్టడం కూడా మారిపోతుంది. ఆ పునాదిని అసలే తీసేస్తే, కట్టడం కూడా కూలిపోతుంది. కొత్త పునాదిని వేయగానే దానికి తగిన కట్టడం తయారౌతుంది.

ఈ దృక్పథంతో చూచినపుడు భాష కట్టడం కానే కాదు. ఉదాహరణకు రష్యన్ సమాజాన్ని, రష్యన్ భాషనూ తీసుకొని చూద్దాం. రష్యాలో గత ముప్పై ఏళ్ళలోనూ పాత పెట్టుబడిదారీ పునాదిని నిర్మూలించి, దానిస్థానే కొత్త సోషలిస్టు పునాదిని నిర్మించారు. దాంతో పాతపెట్టుబడిదారీ పునాది మీద కట్టబడిన కట్టడం కూడా కూలిపోయింది. సోషలిస్టుపునాదికి అనుగుణమైన కొత్తకట్టడం నిర్మించబడింది. పాతరాజకీయసంస్థలు, న్యాయవ్యవస్థలు వగైరాపోయి, కొత్త సోషలిస్టుసంస్థలు వచ్చాయి. అయినా రష్యన్ భాషమాత్రం అక్టోబరు విప్లవానికిపూర్వం ఎలావుండేదో యిప్పుడూ, ప్రధానంగా, అలానే వుండిపోయింది.

ఈ దశలో రష్యన్ భాషలో వచ్చిన మార్పులేమిటో చూద్దాం. రష్యన్ భాషలోని పదజాలంలో కొంతవరకు మార్పు వచ్చింది. అంటే కొత్తసోషలిస్టు ఉత్పత్తివిధానం, కొత్త

ప్రభుత్వయంత్రం, కొత్తసోషలిస్టు సంస్కృతి, కొత్తసమాజం, కొత్తనీతినియమాలు ఏర్పడటంతోనూ, టెక్నికు - సైన్సు అభివృద్ధిఅవడంతోనూ వాటితోబాటు కొత్తపదాలు, కొత్త పదప్రయోగాలు రష్యన్ భాషలో వచ్చిచేరాయి. అనేకమాటలకూ, పదప్రయోగాలకూ భావార్థమే పూర్తిగా మారిపోయింది. వాడుకలోలేని కొన్నిమాటలు అసలే వదలివేయబడ్డాయి. పెట్టుబడిదారీ పునాది పోయిన తర్వాతకూడా భాషకు ఆధారభూతమైన రష్యన్ భాషలోని మూలపదసంపదనూ, వ్యాకరణ స్వరూపాన్నీ తీసేసి, వాటిస్థానంలో కొత్త మూలపదజాలాన్నీ, కొత్తవ్యాకరణ స్వరూపాన్నీ ఏర్పాటు చేయలేను. పెద్దమార్పేమీ లేకుండానే, ఆధునిక రష్యన్ భాషను పునాదిగా, అవి, అలానే వుండిపోయాయి.

ఇంకాచూద్దాం. పునాదినుంచే కట్టడం బయలుదేరుతుంది. అంతమాత్రంచేత కేవలం పునాదిని ప్రతిబింబించడమే కట్టడం పని అనుకోడానికిగానీ, ఆ పునాదిని, ఆ వర్గాలను, ఆ విధానాన్ని గాలికి వదలేసి తాను వుపేక్ష వహిస్తుందనుకోడానికిగానీ వీల్లేదు. దానికి పూర్తి విరుద్ధంగా జరుగుతుంది. ఆ కట్టడం ఒక రూపం తీసికోగానే పెద్ద బలమైన శక్తిగా తయారౌతుంది. పునాది ఒక స్వరూపంతీసికొని గట్టిపడేటట్టుగా చేస్తుంది. పాతపునాదినీ, పాతవర్గ సంబంధాలనూ ధ్వంసంచేయడంలో కొత్తపద్ధతికి సర్వవిధాలా సహాయపడుతుంది.

ఇంతకుమించి యింకోవిధంగా జరగడానికికూడా వీల్లేదు. ఎందుకనంటే, కట్టడం పునాదిచేతనే నిర్మించబడింది. క్రుంగిపోయిన పాతపునాదినీ, పాతకట్టడాన్నీ ధ్వంసంచేయడానికీ,

నూతన స్వరూపం తీసికోవడంలో తనకు సహాయపడటానికీ, తాను గట్టిపడటానికీ బాగా తోడ్పడుతుందనే పునాది కట్టడాన్ని నిర్మించుకుంటుంది. కట్టడం తన సహాయక పాత్రను వదలేసి, పునాదిని కాపాడకుండా వుపేక్షించే స్థితికి దిగజారి, వివిధవర్గాలయెడ సమానమైన దృక్పథం వహించడం మానేసి నప్పుడు తన స్వభావాన్ని వదలుకొని, తన అస్తిత్వాన్నే కోల్పోతుంది.

ఈ దృష్టితో చూచినప్పుడు కట్టడంకంటే భాష పూర్తిగా విభిన్నమైనదని సుస్పష్టం. అందుచేత భాష యీ పునాదినుంచో - ఆ పునాదినుంచో, లేక నిర్దిష్ట సమాజం లోని పాత - కొత్త పునాదులనుంచో నిర్మించబడిందికాదు. వందల యేళ్ళ సామాజిక చరిత్రనుంచీ, అనేక పునాదుల చరిత్రనుంచీ భాష పుట్టుతున్నది. వందలకొద్దీ తరాలపాటు కష్టపడి, మొత్తం సమాజమూ, సమాజంలోని సర్వవర్గాలూ భాషను ఏర్పర్చుకున్నాయి గాని, ఏ ఒక ప్రత్యేక వర్గమో దాన్ని సృష్టించలేదు. మొత్తం సమాజంయొక్క, సమాజం లోని సర్వ వర్గాలయొక్క అవసరాలు తీర్చుకోడానికై భాష సృష్టించబడింది గాని, ఏ ఒక్క వర్గంకోసమూ కాదు. ఇందు కనే సమాజానికంతకీ ఒకే రకంగా వుండేటట్లూ, సమాజం లోని వాళ్ళందరికీ సమష్టిగా వుండేటట్లూ ప్రజాభాషగా సృష్టించబడుతూ వచ్చింది. ఈ దృష్టితో చూస్తే ప్రజల వ్యవ హార నిర్వహణకైన సాధనంగా భాషయొక్క సహాయక పాత్ర సమాజానికంతకీ, సమాజంలోని వర్గాల కన్నిటికీ సమంగానే వుంటుందిగాని, యితరవర్గాలకు హానికలిగించేం దుకై ఏ ఒక వర్గానికో తోడ్పడటంగాఉండదు. చచ్చిపోతున్న

పాతవిధానానికీ – అప్పుడప్పుడే తలెత్తుతున్న కొత్తవిధానానికీ, పాత పునాదికీ – కొత్తపునాదికీ, దోపిడీచేసేవానికీ – దోపిడీ చేయబడేవానికీ ఒకే రకంగా భాష ఎలా సహాయ పడగలదో పై వివరణద్వారా స్పష్టమౌతున్నది.

రష్యన్ భాష, అక్టోబరు విప్లవానికి పూర్వం రష్యన్ పెట్టుబడిదారీ వ్యవస్థకూ, రష్యన్ బూర్జువా సంస్కృతికియెలా వుపయోగపడిందో, అలాగే, యివ్వాళ రష్యన్ సమాజంలోని సోషలిస్టు వ్యవస్థకూ, సోషలిస్టు సంస్కృతికికూడ వుపయోగ పడుతున్నది. ఆ యా జాతుల పాత బూర్జువా విధానాల కన్నిటికీ సహాయపడి, అలానే కొత్త సోషలిస్టు విధానానికి కూడా సహాయపడుతున్న యుక్రెయిన్, బైలో రష్యన్, వుజ్ బెక్, కజక్, జార్జియన్, ఆర్మీనియన్, ఎస్తోనియన్, లాట్వియన్, లిథూనియన్, మోల్డావియన్, తాతార్, అజర్‌బైజాన్, బాష్కిర్, టర్క్‌మెన్ మొదలైన వివిధ సోవియట్ జాతులకు చెందిన భాషల విషయంలో కూడా యింతే.

ఇంతకంటే మరోవిధంగా జరగడానికికూడా వీల్లేదు. ప్రజలమధ్య వ్యవహార నిర్వహణకైన సాధనంగా సమాజాని కంతకీ సహాయపడటానికి, వర్గ విచక్షణ లేకుండా సామాజి కుల కందరికీ సమంగా తోడ్పడడానికి భాష సృష్టించబడింది. భాష మనుగడకూడా అందుకే. ప్రజల కందరికి ఉపయుక్తంగా వున్న యీ పంథానుంచి భాష పెడదారి తొక్కుతుందా? సమాజంలోని యితర వర్గాల కన్నిటికీ హాని కలిగిస్తూ, ఏదో ఒక సామాజిక ముఠాకుమాత్రమే సహాయ పడటానికి భాష సంసిద్ధ మౌతుందా? అలా చేస్తే భాష తన స్వభావాన్నే కోల్పోతుంది. సమాజంలో వ్యవహార నిర్వహణకైన సాధనం

కాకుండా పోతుంది. ఏదో ఒక ముఠాకుచెందిన అపభ్రంశ భాషగా తయారౌతుంది. అధోగతికి దిగజారిపోతుంది. తన అస్తిత్వాన్నే కోల్పోతుంది.

అందుచేత భాష కట్టడానికి పూర్తిగా విభిన్నమైనదే. పోతే, భాషను ఉత్పత్తి సాధనాలతో మాత్రం పోల్చవచ్చు. భాషలాగానే ఉత్పత్తి సాధనాలుకూడా - అంటే యంత్రాలు, ఈ వర్గం ఆవర్గం అనే విచక్షణ లేకుండా పెట్టుబడిదారీ వ్యవస్థకూ, సోషలిస్టు వ్యవస్థకూకూడా సమంగానే సహాయ పడుతుంటాయి.

ఇంకా చూద్దాం. నిర్దిష్టమైన ఆర్థికపునాది అమల్లోవున్న ఒక చారిత్రిక సమయంలో కట్టడం తయారౌతుంది. అందుచేత ఆ పునాది నాశనమై కనపడకుండా పోగానే, ఆ కట్టడం కూడా నశించిపోతుంది.

భాష విషయంలో అలాకాదు. భాష యుగయుగాల చారిత్రిక గమనంలో వుత్పన్నమౌతుంది. ఆ కాలక్రమంలోనే ఒక నిర్దిష్ట స్వరూపం తీసికొని, పరిపుష్ట మౌతుంది. అభివృద్ధి పొందుతూ, మెరుగులు తేలుతుంది. అందుచేత ఏపునాదికన్నా, కట్టడంకన్నాకూడా భాష ఎక్కువకాలం మనుతుంది. ఒక పునాది, దాని కట్టడమేకాకుండా అనేక పునాదులు, వాటి కట్టడాలు రూపొంది నాశనమైపోతున్నా, వాటికి సంబంధించిన భాష, భాషాస్వరూపమూ నాశనమై పోవడానికిగానీ, కొత్త పదసంపద, కొత్త వ్యాకరణ స్వరూపమూ కల్గిన భాష బయలుదేరడానికిగానీ, అవి, చరిత్రలో దారితీయడంలేదు.

పుష్కిన్ చనిపోయి వందేళ్ళు దాటింది. ఈ వందేళ్ళలోనూ రష్యాలో ఫ్యూడల్, పెట్టుబడిదారీ వ్యవస్థలు రెండు

పోయి మూడోది సోషలిస్టు వ్యవస్థ ఏర్పడింది. అంటే రెండు పునాదులు కట్టడాలతోసహా కూల్చివేయబడ్డాయి. కొత్త కట్టడంతో కొత్తసోషలిస్టుపునాది ఏర్పడింది. అయినా, రష్యన్ భాషలోమాత్రం యీవందేళ్ళలోనూ ముఖ్యమైన మార్పేమీ రాలేదు. ఇవ్వాళటి రష్యన్ భాషకీ, పుష్కిన్ కాలంనాటి భాషకీ బహు స్వల్పభేదం మాత్రమే కన్పడుతున్నది.

ఈ వందేళ్ళలోనూ భాషలోవచ్చిన మార్పులేమిటి? రష్యన్ పదజాలంలో చాల కొత్తపదాలు వచ్చి కలిశాయి. వాడుకలో లేని పదాలు. చాలా పదజాలం నుంచి తీసేయబడ్డాయి. అయినా పుష్కిన్ కాలంనాటి భాషా స్వరూపం, వ్యాకరణ స్వరూపం, మూల పదసంపద ఆధునిక రష్యన్ భాషకు పునాదిగా అలాగే వుంచబడ్డాయి.

ఇది తేలికగా తెలుసుకోగల విషయమే. కట్టడం విషయంలో మామూలుగా జరుగుతున్నట్టే, ప్రతి విప్లవానంతరమూ భాషా స్వరూపాన్నీ, వ్యాకరణ పద్ధతినీ, మూల పదసంపదనూ నిర్మూలించి, కొత్త భాషను ఎందుకేర్పర్చుకో గూడదు? "నీళ్ళు", "నేల", "కొండ", "అడవి", "చేప", "మనిషి", "వెళ్లు", "చేయు", "పండించు", "వ్యాపారం", మొదలైనవాటిని నీళ్ళు, నేల, కొండ మొదలైన పేర్లతో పిలవకుండా, మరో రకంగా ఎందుకు పిలవకూడదు? భాషలో పదాలమార్పిళ్లూ, వాక్యంలో పదాలకూర్పులూ, ఇప్పుడున్న వ్యాకరణాన్నిబట్టి కాకుండా, ఇంకోపద్ధతి ఎందుకవలంబించ గూడదు? భాషలో అలాంటి మార్పులు చేసినందువల్ల విప్లవానికి వచ్చి ఒరిగేదేమిటి? ప్రత్యేకమైన అవసరం లేనిదే ముఖ్యమైనదాన్ని దేనినీ, సామాన్యంగా చరిత్ర ఎన్నడూ

చేయదు. ప్రస్తుతం వాడుకలో వున్న భాష, భాషా స్వరూపం కొత్త వ్యవస్థయొక్క అవసరాలన్నిటినీ చాలమట్టుకు బాగానే తీర్చగలుగుతున్నాయని రుజువైనప్పుడు మార్పు తీసుకురావలసిన అవసర మేమిటి? అనే ప్రశ్న ఉదయిస్తుంది. సమాజంలోని ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి అవకాశం కలించడానికై, కొన్ని సంవత్సరాల్లో పాత కట్టడాన్ని ధ్వంసంచేసి, ఆ స్థానంలో కొత్త కట్టడాన్ని నిర్మించడం సాధ్యమౌతుంది. అది అవసరం కూడా. కాని, యిప్పుడున్న భాషను నాశనంచేసి, ఆస్థానంలో కొత్తభాషను కొన్నిసంవత్సరాల్లో నిర్మించాలంటే సామాజిక జీవితంలో అరాచకం ప్రవేశపెట్టకుండా, సమాజం భిన్నాభిన్నమై పోయేప్రమాదం కలించకుండా ఎలా సాధ్యమవుతుంది? వెర్రి పుల్లాయిలు తప్ప యింకెవరన్నా యిలాంటి పనికి పూనుకుంటారా?

చివరకు, కట్టడానికీ భాషకూ మధ్య మరో ముఖ్యమైన భేదంకూడా వున్నది. కట్టడానికి ఉత్పత్తితోనూ, మానవుని ఉత్పత్తి కార్యాచరణతోనూ, ప్రత్యక్ష సంబంధంలేదు. ఆర్థిక విధానం ద్వారానూ, పునాది ద్వారానూ పరోక్షంగా మాత్రమే ఉత్పత్తితో దానికి సంబంధం ఉన్నది. అందుచేత ఉత్పత్తిశక్తుల అభివృద్ధిస్థాయిలోని మార్పుల్ని, కట్టడం వెంటనే, ప్రత్యక్షంగా, ప్రతిబింబించదు. ఉత్పత్తిలో వచ్చిన-మార్పులు పునాదిలో ప్రతిబింబించడం ద్వారా, ఆ పునాదిలో వచ్చిన మార్పుల్ని కట్టడం ప్రతిబింబిస్తుంది. దీన్నిబట్టి కట్టడంయొక్క కార్యరంగం సంకుచితమైనదనీ, పరిమితమైనదని కన్పడుతోంది.

భాష విషయంలో అలా కాదు. భాషకు మానవుని ఉత్పత్తి కార్యాచరణతో ప్రత్యక్ష సంబంధం ఉన్నది. ఒక్క ఉత్పత్తి కార్యాచరణతోనే కాదు; ఉత్పత్తినుంచి పునాది దాకా, పునాదినుంచి కట్టడందాకా అన్ని కార్యరంగాల్లోనూ మానవుని కార్యాచరణతో భాషకు ప్రత్యక్ష సంబంధంవున్నది. అందుచేత, భాష, పునాదిలో మార్పులు వచ్చేవరకూ వేచి వుండకుండా, ఉత్పత్తి విధానంలోని మార్పుల్ని వెంటనే, ప్రత్యక్షంగా ప్రతిబింబిస్తుంది. అందువల్ల మానవుని కార్య రంగాలన్నింట్లోనూ వ్యాపించివున్న భాషయొక్క కార్యరంగం, కట్టడంయొక్క కార్యరంగంకంటే విశాలమైనది; విభిన్నమైనదీ కూడా. అంతేకాదు; దాదాపు యీ కార్యరంగానికి హద్దులే లేవు.

భాష, ముఖ్యంగా భాషలోని పదజాలం తరచు ఎందుకు మారుతూనే వుంటూందన్న విషయం దీనివల్ల మనకు బోధ పడుతుంది. పరిశ్రమలు – వ్యవసాయం, వ్యాపారం – రవాణా, టెక్నికు – సైన్సుల్లోని నిరంతర అభివృద్ధే వాటిపనికి అవసర మైన కొత్తపదాలను, కొత్త ప్రయోగాలనూ భాష వృద్ధి పొందించుకొనేలా చేస్తున్నది. భాష యీ అవసరాలను ప్రతి బింబిస్తూ, కొత్తపదాలను తన పదజాలంలో చేర్చుకుం టుంది. తన వ్యాకరణ పద్ధతిని సరిదిద్దుకుంటుంది.

అందుచేత

1. భాషను పునాదిమీది కట్టడంగా మార్క్సిస్టు పరిగణించడు.

2 కట్టడం, భాష ఒకటేనని గందరగోళ పర్చడమంటే పెద్ద తప్పిదం చేయడమే.

ప్రశ్న:—భాషకు ఎప్పుడూ వర్గస్వభావం ఉందనీ, ఇకముందుకూడా ఉంటుందనీ, వర్గస్వభావం లేకుండా సమాజానికంతకీ ఒకేరకమైన సమష్టి ప్రజాభాష ఉండదనీ చెప్పడం సరైనదేనా ?

జవాబు:— కాదు. అలాచెప్పడంతప్పు. వర్గాలులేని సమాజంలో వర్గభాషఅన్న ప్రశ్నేవుండదని తేలిగ్గా తెలిసే సంగతే. ఆదిమదశలో తెగలు తెగలుగా వుండేటప్పుడు వర్గాలనేవేలేవు. అందుచేత వర్గస్వభావంగల భాషకూడా అప్పుడు వుండటానికి వీల్లేదు. ఆ తెగకంతకూ ఒకటిగావుండే సామాన్య భాష వుండేది. తెగలు తెగలుగావుండే ఆదిమదశతోసహా మానవులు సమష్టిగా నివసించే ప్రతిదశలోనూ వర్గాలున్నాయని వాదించడం మాటలచాటున అసలుసంగతిని మరుగుపర్చడమేగాని, వాస్తవంకాదు. అలాంటి వాదన తప్పుని నిరూపించవలసిన అవసరంకూడాలేదు.

ఆ దశనుంచి అభివృద్ధి చెందుతూ, గణాల భాషలనుంచి తెగల భాషలు, తెగల భాషలనుంచి జాతుల భాషలు, జాతుల భాషలనుంచి జాతీయభాషలు వృద్ధిపొందుతూ వచ్చాయి. ఇలా వృద్ధిపొందుతున్నప్పుడు ప్రతిదశలోనూ భాష ప్రజల మధ్య వ్యవహారనిర్వాహణకైన సాధనంగా సమాజానికంతకీ ఒకేరకంగావుంటూ, అందరికీ సమానంగా సహాయపడుతూవచ్చింది.

ఇలా చెబుతున్నప్పుడు బానిససామ్రాజ్యాలనో, మధ్యయుగాలనో—అంటే స్వంత ఆర్థికపునాదేమీ లేకుండా తాత్కాలికము, అస్థిరమూ అయిన సైనిక పరిపాలనా కూటములకు

ప్రతినిధులుగా వున్న సైరస్, అలెగ్జాండర్ ది గ్రేట్ సామ్రాజ్యాలనో, లేకపోతే సీజర్, చార్లెస్ ది గ్రేట్ సామ్రాజ్యాలనో నా దృష్టిలో పెట్టుకొని చెప్పడంలేదు. సామ్రాజ్యానికంతకూ ఒకేరకంగావుంటూ సామ్రాజ్యంలో వున్న వాళ్ళందరికీ అర్థమయ్యేభాష యీ సామ్రాజ్యాలకు లేదు. ఆ రోజుల్లో అలాంటిభాష వుండటానికికూడ అవకాశం లేదు. తమ ప్రత్యేక జీవనవిధానాన్ని తాము సాగించుకుంటూ, తమ భాష తాము మాట్లాడుకుంటూవున్న తెగల, జాతుల సమ్మేళ నానికి యీ సామ్రాజ్యాలు ప్రాతినిధ్యం వహించేవి. ఇలాంటి సామ్రాజ్యాలను గురించి నే నిప్పుడు చెప్పబోవడంలేదు. సామ్రాజ్యాలలో ఒక భాగంగా వుంటూ తమ స్వం ఆర్థిక పునాదీ, చాలకాలం క్రితమే ఒక స్వరూపం తీసుకున్న తమ స్వంత భాషలూగల తెగల్ని, జాతులను దృష్టిలో పెట్టుకొని నేను చెబుతున్నాను. ఈ తెగల, జాతుల భాషలు వర్గభాషలు కావనీ, అందరికీ సంబంధించిన ప్రజాభాషలనీ, ఇలాంటిభాషలు అన్ని తెగలకూ, జాతులకు వుండేవనీ చరిత్ర తెలియజేస్తున్నది. ఈ భాషతో పాటు మాండలికాలు, ప్రాంతీయ ఉచ్చారణలు వున్నప్పటికీ, వాటన్నిటికీపైన, వాటిని తనలో లీనం చేసుకుంటూ ఆ తెగకో, జాతికో ఏకీకృతమైన సామాన్యభాష ఒకటి వ్యాపించివుండేది.

ఆ తర్వాత, పెట్టుబడిదారీ విధానం రావడంతోనూ, శిథిలమైపోయిన ఫ్యూడల్ విధానాన్ని కూలదోసి, జాతీయ మార్కెటు తలయెత్తడంతోనూ వివిధజాతులు ఒకజాతిగానూ, ఆజాతుల భాషలు జాతీయభాషగానూ వృద్ధిజెందాయి. జాతీయ భాషలు వర్గభాషలు కావనీ, ప్రజాభాషలనీ, ఇవి తెగలకు,

జాతులకూ సమష్టిగావుంటూ వాళ్ళ కందరికీ అర్థమయేటట్లు వుండేవనీ చరిత్ర చెబుతున్నది.

భాష సమాజంలో వ్యవహారనిర్వహణకైన సాధనంగా సమాజంలోని అన్ని వర్గాలకూ సమంగానే ఉపయోగ పడుతుందనీ, యీ విషయంలో వర్గాలయెడ ఒక రకమైన ఉపేక్షా భావం ప్రదర్శిస్తుందనీ యిదివరకే చెప్పుకున్నాం. కాని ప్రజలు, సామాజికముఠాలు, వర్గాలుమాత్రం భాషవిషయంలో అట్టి వుపేక్ష వహించడంలేదు. తమ స్వప్రయోజనాలకోసం భాషను వుపయోగించుకోడానికీ భాషలో తమ కవసరమైన నిర్దిష్ట పదజాలాన్ని, ప్రత్యేక పరిభాషను, ప్రత్యేకపదప్రయోగాలను ప్రవేశపెట్టడానికీ ప్రయత్నిస్తాయి. ప్రజలనుంచిదూరమై, ప్రజల్ని పీడించుకునే ఆస్తిపరులైన వర్గాల్లోని పై తరగతులవాళ్ళూ, రాజవంశీకులూ, బూర్జువావర్గంలోని పైతరగతివాళ్లూ యీ విషయంలో నగ్నంగా వేరుబడిపోయారు. కాలక్రమేణా "వర్గ" మాండలికాలు, అపభ్రంశభాష, విలాసగృహాల "భాష" ఏర్పడ్డాయి. సాహిత్యంలో యీ మాండలికాలకు, అపభ్రంశ భాషకు భాష అనే బిరుదు తరచు యివ్వబడింది. "రాజ వంశీకుల భాష", "బూర్జువా భాష"లు "కార్మికవర్గ భాష", "రైతు భాష"లకు విరుద్ధమైనవిగా చెప్పబడ్డాయి. ఈ వాదన వింతగా కనబడుతున్నప్పటికీ దీన్ని ఆధారం చేసుకునే మన కామ్రేడ్స్ జాతీయభాష కల్పితమనీ, వాస్తవంలో వర్గభాషలు మాత్రమే ఉంటాయనీ నిర్ణయానికి వచ్చారు.

అటువంటి నిర్ణయం శుద్ధ పొరబాటని నాఅభిప్రాయం. ఈ మాండలికాలను, అపభ్రంశ భాషలను భాషలుగా పరిగ

ణించడానికి వీలుందా? వీల్లేదు. ఎందుకనంటే (1) ఈ మాండలికాలకు, అపభ్రంశ భాషలకు స్వంత వ్యాకరణంగానీ, స్వంత మూల పద సంపదగానీ లేవు – వాటిని జాతీయభాష నుంచే అవి ఎరువు తెచ్చుకుంటాయి. (2) ఈ మాండలికాలు, అపభ్రంశ భాషలు ఏదో ఒక వర్గంలోని పైతరగతి వాళ్ళలో చాల పరిమితమైన హద్దుల్లో మాత్రమే వాడబడుతూ, ప్రజల మధ్య వ్యవహార నిర్వహణకైన సాధనాలుగా మొత్తం సమాజానికంతకీ పనికిరాకుండా పోతున్నాయి. అందుచేత వీటిని భాషలుగా పరిగణించడానికి వీల్లేదు. అయితే వాటి లక్షణాలేమిటి? రాజవంశీకులయొక్కయో, బూర్జువావర్గంలోని పైతరగతివాళ్ళయొక్కయో, ప్రత్యేక అభిరుచుల్ని ప్రతిబింబించే కొన్ని ప్రత్యేక పదాల సముదాయం, పద లాలిత్యంతోనూ, పద గాంభీర్యంతోనూ విశిష్టమైన కొన్ని పద ప్రయోగాలు, కొన్ని ప్రత్యేక అలవాట్లు కలిగి వుండడం, "మోటు" ప్రయోగాలు లేకుండా వుండడం, జాతీయభాష మాట్లాడేతీరు, గమనించతగినంతగా అన్యదేశ్యపదాలు కలిగివుండటం – ఇవి మాండలికాలకు, అపభ్రంశభాషలకు వుండే లక్షణాలు. అయితే ప్రధాన భాగంమాత్రం అంటే అత్యధికపదాలు, వ్యాకరణ పద్ధతీ ప్రజలందరి జాతీయభాషనుంచే తీసుకోబడుతున్నాయి. అందుచేత యీ మాండలికాలు, అపభ్రంశభాషలు ప్రజలందరి జాతీయభాషయొక్క ఉపశాఖలే. అందుకనే వీటికి భాషాశాస్త్రాన్ని కుండవలసిన స్వతంత్రత లేక, స్తంభించి పోవలసిన రాత పట్టింది. మాండలికాలు, అపభ్రంశ భాషలు స్వతంత్ర

భాషలుగా అభివృద్ధి అవుతాయనీ, జాతీయ భాషల్ని తోసేసి వాటి స్థానంలోకి రాగల్గుతాయనీ అనుకోవడమంటేనే — చారిత్రిక పరిశీలనా దృష్టిని కోల్పోతున్నట్టూ, మార్క్సిజానికి తిలోదకాలిస్తున్నట్టూ స్పష్టమౌతున్నది.

బూర్జువాకు "తన స్వంతభాష" వుందనీ, ఆ భాషను "బూర్జువా సృష్టించింద"నీ, కొనడం, అమ్మడం మొదలైన వ్యాపార దృష్టితో యీభాష నిండివుందనీ మార్క్స్ వ్రాసిన "సెంట్‌మాక్స్" ("St. Max") వ్యాసాన్ని వీరు ఉదహరిస్తున్నారు. కొంతమంది కామ్రేడ్లు యీ మాటలు తీసుకొని భాషకు "వర్గస్వభావం వుంటుంద"నీ, ఏకీకృతమైన జాతీయ భాష అంటూ లేదనీ మార్క్స్ చెప్పినట్టు రుజువుచేయాలని ప్రయత్నిస్తున్నారు. ఈ కామ్రేడ్లు అసలువిషయాన్ని ఉన్న దున్నట్టుగా పరిశీలించివుంటే, ఆ "సెంట్‌మాక్స్" వ్యాసంలోనే మార్క్స్ ఒకే ఒక జాతీయ భాషగా రూపొందే మార్గాన్ని గురించి చెబుతూ "ఆర్థిక, రాజకీయ కేంద్రీకరణ వున్నప్పుడే మాండలికాలు ఒకే ఒక జాతీయభాషలో కేంద్రీకృతమౌతా" యని చెప్పినదాన్ని కూడా వుదహరించి వుండేవారు.

కాబట్టి ఒకేరకమైన జాతీయభాష అవసరమనీ, మాండలికాలు యీ జాతీయభాషకు లోబడి అధీన రూపాలుగా వుంటాయనీ మార్క్స్ గుర్తించాడు.

అయితే మార్క్స్ "బూర్జువా సృష్టించినభాష" అని వాడిన బూర్జువాభాషయేది? దీన్ని జాతీయభాషలాగా తన స్వంత స్వరూపంగల భాషగానే మార్క్స్ చెప్పాడా? అలా చెప్పివుంటాడా? లేదు. మార్క్స్ చెప్పదలచుకున్నదల్లా

బూర్జువావర్గం తట్టబేరగాడి కేకల్లాంటి అపభ్రంశ భాషతో పకీకృతమైన జాతీయభాషను కలుషితం చేసిందనీ, అందుచేత బూర్జువాజీకి తట్టబేరగాడి కేకల్లాంటి స్వంత అపభ్రంశభాష ఒకటి వున్నదనీ, మాత్రమే.

దీన్నిబట్టి మార్క్సు అభిప్రాయాలకు యీ క్రామేడ్సు అపార్థాలు చెప్పినట్లు స్పష్టం. అసలు విషయంలోని లోతు పాతులకు పోకుండా వితండవాదం చేసేవాళ్ళవలెనే, వీళ్లు మార్క్సును ఉదహరించారుగాని, మార్క్సిస్టుల్లాగా వుదహరించలేదు. అందుకనే తప్పుడర్థాలుకూడా లాగారు.

ఈ సందర్భంలో ఎంగిల్సునుకూడా తీసికొస్తున్నారు. "ఇంగ్లాండులో కార్మికవర్గ పరిస్థితులు" ("Conditions of the working class in England") అనే పుస్తకంలో "కాలక్రమేణా బ్రిటిష్ కార్మికవర్గం బ్రిటిష్ బూర్జువావర్గానికి పూర్తిగా విభిన్నమైన ప్రజలుగా తయారౌతున్నార"నీ, "కార్మికులు మాట్లాడేతీరు, కార్మికుల భావాలు, భావనలు, నీతినియమాలు, మతం, రాజకీయాలు యివన్నీ బూర్జువాజీకంటె విభిన్నమైనవ"నీ ఎంగిల్సు చెప్పినదాన్ని వుదహరిస్తున్నారు. కొంతమంది క్రామేడ్సు యీ మాటల్ని ఆధారం చేసికొని, సర్వప్రజలకూ సంబంధించిన జాతీయభాష అవసరమనే విషయాన్ని ఎంగిల్సు ఒప్పుకోలేదనీ, "వర్గ" భాషకే ఆయన అనుకూలుడనీ నిర్ణయానికి వస్తున్నారు. నిజమే! ఎంగిల్సు యిక్కడ చెప్పింది మాండలికాలను గురించేగాని, భాషనుగురించికాదు. జాతీయభాషకు ఉపశాఖలైన ఈమాండలికాలు జాతీయ భాషాస్థానాన్ని ఆక్రమించలేవన్నసంగతి

స్పష్టంగా తెలుసుకోవాలి. కాని, వచ్చిన చిక్కల్లా భాషకూ — మాండలికానికీ తేడా వుందన్న సంగతి గుర్తించడానికే యీ కామ్రేడ్సుకు యిష్టంలేదు.

ఎంగిల్సు యిక్కడ ప్రధానంగా చెప్పింది వర్గ భావాలు, భావనలు, నీతి నియమాలు, మతం, రాజకీయాలను గురించే గాని, వర్గ భాషల్ని గురించి కానేకాదు. అందుచేత ఆ మాటల్ని యిక్కడ ఉదహరించడం అసందర్భమౌతుంది. బూర్జువావర్గం యొక్క భావాలు, భావనలు, నీతినియమాలు, మతం, రాజకీయాలు కార్మికవర్గం యొక్క భావాలు, భావనలు వగైరాలకు పూర్తిగా విరుద్ధమైనవన్న సంగతి ముమ్మాటికీ నిజం. అయితే జాతీయ భాషతోగాని, భాషయొక్క "వర్గ" స్వభావంతోగాని దీనికి సంబంధమేమిటి? సమాజంలో వర్గ వైరుధ్యాలుండటం "వర్గ" భాషకు అనుకూలంగాగాని, ఏకీకృతమైన జాతీయభాష అవసరమనేదానికి వ్యతిరేకంగాగానీ, ఒక వాదనగా, ఎలా ఉపయోగపడుతుంది? జాతిలోనే వర్గ వైరుధ్యాలున్నాయని పూర్తిగా తెలిసివున్నా ఏకీకృతమైన భాష జాతికి ఉండవలసిన అతి ప్రధాన స్వభావాల్లో ఒకటిగా మార్క్సిజం చెబుతోంది. ఈ మార్క్సిస్టు ప్రతిపాదనను ఆ కామ్రేడ్సు ఒప్పుకుంటారా?

"భాష — విప్లవం" అనే పుస్తకంలో లెఫార్గ్యు "వర్గ" భాష వుందని అంగీకరిస్తున్నాడనీ, ప్రజలందరి జాతీయ భాష అవసరమనే సంగతి ఒప్పుకోవడం లేదనీ ఆయన్ని కూడ తమ వాదన కనుకూలంగా ఉదహరిస్తున్నారు. అది నిజంకాదు. "రాజవంశీకుల" భాషను గురించీ, సమాజంలోని వివిధ తరగతుల "అపభ్రంశ భాషను" గురించీ,

లెఫార్గ్యు చెప్పిన సంగతి వాస్తవమే. కాని భాషకీ, అపభ్రంశ భాషకీ వున్నతేడాను గురించి ఆయన ఎత్తుకోనేలేదన్న సంగతి మాత్రం యీ కామ్రేడ్సు మర్చిపోతున్నారు. మాండలికాలను "కృతకభాష" అనీ, "అపభ్రంశభాష" అనీ పిలుస్తూ "రాజవంశీకులకు మాత్రమే విశిష్టమైన యీ కృతకభాష... బూర్జువాలు, వృత్తిపనివారు, పట్టణవాసులు, పల్లెవాసులు అందరూ మాట్లాడే భాషనుంచే పుట్టింది" అని తన పుస్తకంలో లెఫార్గ్యు ఖండితంగా చెప్పాడు.

"రాజవంశీకులభాష" యితర మాండలికాలు, అపభ్రంశ భాషలు ప్రజాభాషమీాదే ఆధారపడివున్నాయనీ, ప్రజాభాషను లోబడే వుంటాయనీ ఆయనకు బాగా తెలుసు. అందుకనే ప్రజలందరికీ సంబంధించిన భాష ఒకటివుందనీ, అలాంటిది వుండాలనీ లెఫార్గ్యు ఒప్పుకుంటున్నాడు.

అందుచేత లెఫార్గ్యును వుదహరించడం పూర్తిగా అప్రస్తుతం.

ఇంగ్లాండులో ప్రజలు ఇంగ్లీషే మాట్లాడుతున్నా, ఒకప్పుడు, ఇంగ్లీషు ఫ్యూడల్ ప్రభువులుమాత్రం "శతాబ్దాలపాటు" ఫ్రెంచిభాష మాట్లాడుతూవుండే వారన్న విషయాన్ని "వర్గ"భాషను అనుకూలంగానూ, ప్రజాభాష అవసరమనేదానికి వ్యతిరేకంగానూ కొంతమంది వుదహరిస్తున్నారు. నిజానికి ఇది ఒక కథగా వున్నదేగాని, వాదనగాలేదు. మొదటిది: ఆరోజుల్లో ఫ్యూడల్ ప్రభువులందరూ ఫ్రెంచిభాష మాట్లాడేవారుకాదు. రాజసభలకూ, సామంత ప్రభువుల ఆస్థానాలకూ సంబంధించిన బహుకొద్దిమంది ఉన్నత ఇంగ్లీషు ఫ్యూడల్ వ్యక్తులుమాత్రమే ఫ్రెంచిభాష మాట్లాడేవారు. రెండోది: వాళ్ళుమాట్లాడేది

సామాన్య ప్రజలు మాట్లాడుకునే ఫ్రెంచిభాషే.కాని, "వర్గ" భాషకాదు. మూడోది: ఫ్రెంచి భాషమీద మోజుపెట్టిన యీ అతిమోజు అంతూ అయిపూ లేకుండా పోయింది. ప్రజలు మాట్లాడుకునే ఇంగ్లీషుబాషే ఆస్థానం వహించింది. "కొన్ని శతాబ్దాలపాటు" ఇంగ్లీషుప్రభువులూ, ఇంగ్లీషు ప్రజలూ దుబాసీలద్వారానే మాట్లాడుకున్నారనీ, ఇంగ్లీషు ప్రభువులు ఇంగ్లీషు మాట్లాడేవారుకాదనీ, ఆరోజుల్లో ప్రజల ఇంగ్లీషు ఉండేదేకాదనీ, ఇంగ్లాండులోని ఉన్నత రాజవంశీకులకు చెందిన బహుకొద్దిమంది మాత్రం మాట్లాడే విలాసగృహాల భాషగా కాక, ఇంగ్లండులో ఫ్రెంచిభాషకు ప్రత్యేక ఆధిక్యత వుండేదనీ యీ కామ్రేడ్సు అనుకుంటున్నారా? ఈ హాస్యాస్పదమైన వాదనల్ని ఆధారంచేసుకొని సామాన్య ప్రజాభాషయొక్క ఉనికినీ, ఆవశ్యకతనూ ఎవరైనాసరే, ఎలా కాదనగలరు?

రష్యన్ రాజవంశీకులుకూడ ఒకప్పుడు మహామోజుగా ఫ్రెంచిభాషను జారు భవనాల్లోనూ, విలాస గృహాల్లోనూ వాడుతుండేవారు. రష్యన్ భాష మాట్లాడేటప్పుడుకూడ ఫ్రెంచినత్తుర్లు కొట్టేవారనీ, ఫ్రెంచియాసతోనే మాట్లాడగలిగే వారనీ గొప్పలు చెప్పుకొనేవారు. అంటే ఆరోజుల్లో రష్యాలో ప్రజలందరి రష్యన్ భాష లేదనీ, ప్రజాభాష అనేది కల్పితమనీ "వర్గభాషే" వాస్తవమనీ అర్థమా?

ఇక్కడ మన కామ్రేడ్సు, కనీసం, రెండు పొరబాట్లు చేస్తున్నారు.

మొదటిది: వారు భాషను కట్టడంఅనుకొని గందరగోళ పడుతున్నారు. కట్టడం వర్గస్వభావం కలిగివుంటే, భాషకూడా వర్గస్వభావమే కలిగివుంటుందనీ, ప్రజలందరికీ సంబంధించివుండ

కనీ అనుకుంటున్నారు. కాని, నేను పైన చెప్పినట్టు భాష, కట్టడం రెండు విభిన్నమైనవి. మార్క్సిస్టు యీ రెంటినీ వలగాపులగం చేయకూడదు.

రెండవది: బూర్జువా వర్గంయొక్క కార్మిక వర్గం యొక్క ప్రయోజనాలు ఒకదాని కొకటి పూర్తి విరుద్ధమవడంవల్ల, తీవ్రమైన వర్గపోరాటంలో సమాజం శిధిలమైపోతుందనీ, శత్రువర్గాల మధ్యవున్న సంబంధాలన్నీ తెగతెంపులై పోతాయని యీ కామ్రేడ్సు అనుకుంటున్నారు. సమాజం విభజింపబడినందువల్ల ఏక్య సమాజమనేదే యిక లేదుకాబట్టి, వర్గాలుమాత్రమే వున్నాయనీ, సమాజానికంతకీ ఏకీకృతమైనభాష, జాతీయభాష వుండనవసరంలేదనీ వీరిఉద్దేశం. సమాజం విభజింపబడి ప్రజల జాతీయభాషే లేకుండాపోతే యిక అప్పుడు మిగిలేదేమిటి? వర్గాలు, "వర్గభాషలు"వుంటాయన్నమాట. ప్రతి వర్గభాషకీ తన "వర్గ" వ్యాకరణంఅంటే —"కార్మిక" వ్యాకరణం, "బూర్జువా" వ్యాకరణం తప్పకుండా వుంటుందన్నమాట. నిజానికి ప్రపంచంలో అలాంటి వ్యాకరణాలు లేవు. అయితే యీ విషయం ఆ కామ్రేడ్సుకుమాత్రం ఏమీ పట్టడంలేదు. అలాంటి వ్యాకరణాలు బయలుదేరుతాయని వారి విశ్వాసం.

అక్టోబరు విప్లవానంతరం మన దేశంలో మిగిలివున్న రైల్వేలన్నీ బూర్జువర్గానివనీ, అందుచేత మార్క్సిస్టులమైన మనం వాటిని వుపయోగించకూడదనీ, ఆ రైళ్ళన్నీ నాశనం చేసి కొత్త "కార్మికవర్గ" రైళ్ళనుతయారుచేయాలనీ వాదించే "మార్క్సిస్టులు" కొంతమంది ఒకప్పుడు వుండేవారు.

పాతదేమీ పనికిరాదని వాళ్ళవుద్దేశం. (వీళ్ళనే ట్రోగ్లొడైట్స్ అని ఎగతాళి చేసేవారు.)

సమాజమంటేనూ, వర్గాలంటేనూ, భాష అంటేనూ వుంటున్న యిలాంటి పురాతన అరాచకదృక్పథానికీ, మార్క్సిజానికీ ఎక్కడా పొత్తులేదు. అయినా మన కామ్రేడ్సు కొందరి బుర్రల్లో యీ భావం బాగా నాటుకునివున్నది; వారిని చీకాకు పెడుతున్నదికూడా.

తీవ్రమైనవర్గపోరాటాలు జరగడంమూలంగా సమాజం వర్గాలుగా విడిపోయిందనీ, ఒకే సమాజంలో యిక పరస్పర ఆర్థిక బంధనాలేమీ వుండవనీ అనడం సరైనదికాదు. పైపెచ్చు తద్విరుద్ధంగా జరుగుతుంది. పెట్టుబడిదారీవిధానం ఉన్నంతకాలం బూర్జువావర్గం, కార్మిక వర్గంకూడా ఒకే పెట్టుబడిదారీ సమాజంలోని భాగాలవలె, ఒకదానికొకటి ఆర్థిక బంధనాలద్వారా ముడిపడివుంటాయి. జీతానికి కార్మికుణ్ణి పెట్టుకోనిదే బూర్జువా వుండలేడు; లాభాలు సంపాదించలేడు. అలాగే పెట్టుబడిదార్ల వద్ద పనిచేయనిదే కార్మికులు తమజీవితం గడుపుకోలేరు. వాళ్ళ మధ్యవుండే ఆర్థిక సంబంధాలను తెంచివేయడమంటే అన్నిరకాల వుత్పత్తిని ఆపుచేయడమే అవుతుంది. ఉత్పత్తిఅంతా ఆగిపోతే సమాజం విచ్ఛిన్నమై పోతుంది. వర్గాలు తమకుతాముగా వినాశనం తెచ్చిపెట్టుకుంటాయి. తనగొయ్యి తానే తీసుకోడానికి ఏవర్గమూ ఒప్పుకోదు. కనుక, వర్గకలహం ఎంత ముమ్మరంగా ఉన్నప్పటికీ సమాజ విచ్ఛిత్తికి దారి తీయజాలదు. మార్క్సిస్టు పరిజ్ఞానం లేకపోవడంవల్లనే, భాషాస్వభావాన్ని కించిత్తుకూడా అర్థం చేసికోకపోడంవల్లనే మన కామ్రేడ్సు కొంతమంది సమాజ

విచ్ఛిత్తినిగురించీ, "వర్గ" భాషల్నిగురించీ, "వర్గ" వ్యాకరణాన్ని గురించీ కట్టుకథ లల్లుతున్నారు.

పైగా లెనిన్‌నికూడా ఉదహరిస్తున్నారు. పెట్టుబడిదారీ విధానంక్రింద బూర్జువా సంస్కృతి, కార్మికవర్గ సంస్కృతి రెండూ వుంటాయని లెనిన్ గుర్తించాడనీ, కనుక పెట్టుబడిదారీ విధానంక్రింద జాతీయ సంస్కృతికోసం యిచ్చిన నినాదం జాతీయ నినాదమనీ అంటున్నారు. నిజమే. లెనిన్ చెప్పింది పూర్తిగా సరైనదే. అయితే, వర్గభాషలకూ, దీనికీ ఏమిటి సంబంధం?

పెట్టుబడిదారీ విధానంక్రింద రెండు సంస్కృతులుంటాయని లెనిన్ చెప్పినదాన్ని వుదహరిస్తూ సంస్కృతికీ, భాషకూ సంబంధం వుండటంవల్ల బూర్జువా సంస్కృతీ, కార్మికసంస్కృతీ వున్నట్లే రెండుభాషలుకూడా వుండాలనీ, ఒకే జాతీయభాష అవసరమనేదాన్ని లెనిన్ అంగీకరించలేదనీ, కనుక లెనిన్ "వర్గ"భాషలు కావాలనే వాడనీ పాఠకులకు నచ్చజెప్పటానికై యీ కామ్రేడ్సు ప్రయత్నిస్తున్నారు. భాష, సంస్కృతి రెండూ ఒకటేనని గందరగోళ పడుతూ వీరుపొరబడుతున్నారు. వాస్తవానికి సంస్కృతి, భాష రెండూ వేరు. బూర్జువా సంస్కృతి, సోషలిస్టు సంస్కృతి అని సంస్కృతి రెండురకాలుండవచ్చు. కాని భాషమాత్రం అలావుండదు. పరస్పర భావ ప్రకటనకైన సాధనంగా భాష ప్రజలందరికీ చెందుతూ, బూర్జువా, సోషలిస్టు సంస్కృతులకు రెంటికీకూడ తోడ్పడుతుంది. రష్యన్, యుక్రెయిన్, ఉజ్‌బెక్‌భాషలు అక్టోబరు విప్లవానికి పూర్వం బూర్జువా సంస్కృతికి తోడ్పడట్లే, యిప్పుడు ఆజాతుల సోషలిస్టు సంస్కృతికికూడా తోడ్పడటం

లేదా ? కాబట్టి రెండుసంస్కృతులున్నప్పుడు రెండు వేర్వేరు భాషలుకూడా బయలుదేరతాయనీ, ఒకేభాష వుండనవసరం లేదనీ వాదించడంలో ఆ కామ్రేడ్సు పూర్తిగా పొరబడుతున్నా రన్నమాట.

రెండుసంస్కృతుల ఉనికి ఏకీకృతభాషను నిరాకరించ డానికిగానీ, రెండు భాషలు ఏర్పడ్డానికిగానీ దారితీయదు; భాష తప్పనిసరిగా ఏకీకృతం చేయబడాలి - అనే విషయాన్ని ఖచ్చి తంగా ఆధారంచేసుకొనే లెనిన్ రెండు సంస్కృతుల్నిగురించి మాట్లాడాడు. అందుకనే జాతీయభాష అవసరమనేదాన్ని లెనిన్ ఒప్పుకోడంలేదనీ, సంస్కృతికి జాతీయ స్వభావం లేదంటున్నాడనీ "బండిస్టులు" విమర్శిస్తున్నప్పుడు లెనిన్ తీవ్రంగా ఖండించాడు. తాను పోరాడుతున్నది బూర్జువా సంస్కృతికి వ్యతిరేకంగానే గాని, జాతీయభాషకు వ్యతిరే కంగా కాదనీ, జాతీయభాష అవసరమనే విషయంలో తనకెట్టి సందేహంలేదనీ, లెనిన్ విశదీకరించిన సంగతి అందరికీ తెలిసి నదే. అయినా మన కామ్రేడ్సు కొంతమంది ఆ బండిస్టుల అడుగుజాడల్లోనే పోవడంమాత్రం ఆశ్చర్యం.

ఏ యేకీకృతబాషను లెనిన్ నిరాకరించాడని మనవా ళ్ళంటున్నారో, దాని అవసరాన్నిగురించి లెనిన్ చెప్పిన యీ మాటలను జాగ్రత్తగా గమనించడం మంచిది :-

"మానవులమధ్య వ్యవహారనిర్వహణకు భాష చాల ముఖ్యమైన సాధనం. ఆనాటి కాపిటలిస్టు వ్యవస్థలో స్వేచ్ఛగా, బహుళంగా వ్యాపారం సాగడానికి, ప్రజలు విస్తృతంగానూ, స్వేచ్ఛగానూ వర్గాలుగా ఏర్పడ్డానికి భాషా, ఐక్యతా, దాని నిరంతర అభివృద్ధీ అత్యవసరం."

దీన్నిబట్టి యీ పెద్దమనుష్యులు లెనిన్ అభిప్రాయాలకు వక్రభాష్యాలు చెప్పినట్టు సుస్పష్టం.

చివరకు, స్టాలిన్ చెప్పినదాన్నికూడ వీరు ఉదాహరణగా చూపిస్తున్నారు. "ఈ దశలో బూర్జువావర్గము, దాని జాతీయ పక్షాలు ఆ జాతుల్లో ప్రధాన నాయక శక్తులుగా వున్నాయి; వుంటున్నాయి" అని స్టాలిన్ చెప్పినమాటల్ని ఉదహరించారు. నిజమే. కార్మికవర్గమూ, దాని అంతర్జాతీయ పక్షమూ కార్మిక సంస్కృతికి నాయకత్వం వహించినట్టుగానే బూర్జువావర్గమూ, దాని జాతీయపక్షమూ బూర్జువా సంస్కృతికి తప్పక నాయకత్వం వహిస్తాయి. అయితే దీనికీ, "వర్గ" భాషకూ సంబంధమేమిటి? జాతీయ సంస్కృతీస్వరూపమే జాతీయభాష అనీ, జాతీయభాష బూర్జువా, సోషలిస్టుసంస్కృతులకు రెంటికీ తోడ్పడుతుంటుందనీ యీ కామ్రేడ్సుకి తెలియదా? నేడున్న రష్యన్, యుక్రేనియన్, బైలోరష్యన్ మొదలగు సంస్కృతులన్నీ సోషలిస్టు స్వభావం, జాతీయస్వరూపం కలిగివున్నాయనీ; అలాగే భాషల్లోకూడాననే సుప్రసిద్ధమైన మార్క్సిస్టుసూత్రం యీ కామ్రేడ్సుకి తప్పకుండా తెలిసేవుంటుంది. ఈమార్క్సిస్టుసూత్రంతో వారు ఏకీభవిస్తున్నారా?

ఇక్కడ మన కామ్రేడ్సు చేస్తున్న పొరబాటేమిటంటే సంస్కృతికీ, భాషకూ మధ్యవున్న తేడా చూడడంలేదు. సమాజం అభివృద్ధిపొందుతున్నప్పుడు ప్రతి నూతనదశలోనూ సంస్కృతి స్వభావంలో మారుతున్నప్పటికీ, భాషమాత్రం అనేకదశలవరకూ యథాప్రకారంగానే వుంటూ పాత, కొత్త సంస్కృతులకు రెండింటికీ సమంగానే తోడ్పడుతూందన్న సంగతి వీరు అర్థంచేసుకోవడంలేదు.

అందుచేత—

1. భాష వ్యవహార నిర్వహణకైన సాధనంగా ఎప్పుడూ సమాజానికంతకీ ఒకేరకంగానూ, ఆసమాజంలో వుండేవాళ్ళందరికీ సామాన్య భాషగానూ వుంటూనేవుంది. ఇకముందుకూడా అలానేవుంటుంది.

2. మాండలికాలు, అపభ్రంశభాషలు వున్నాయనే విషయం ప్రజాభాషను నిరాకరించకపోగా, దాని అస్తిత్వాన్ని దృఢపరుస్తాయి. అవి, ఆప్రజాభాషను అధీనమైన ఉపశాఖలే.

3. "వర్గ" భాషవుందని సిద్ధాంతీకరించడం శుద్ధతప్పు. అది మార్క్సిస్టు సూత్రాలకే విరుద్ధం.

ప్రశ్న :—భాషకు వుండవలసిన విశిష్ట లక్షణాలేమిటి?

జవాబు :— సమాజం జీవించివున్నంతవరకూ వ్యవహారంలోవుండే ఒకసామాజిక దృగ్విషయమే భాష. సమాజంతోపాటే భాషకూడాపుట్టి, పెరుగుతూ వుంటుంది. సమాజం నశించినప్పుడే భాషకూడా నశిస్తుంది. సమాజంతో సంబంధం లేకుండా భాషలేనేలేదు. భాషను పునాదివేసి, పెంపొందించుకుంటూ వస్తున్న సమాజ చరిత్రతోనూ, ఆయాభాషలు మాట్లాడే ప్రజల చరిత్రతోనూ భాషకు, దాని పరిణామ సూత్రాలకూగల అవినాభావ సంబంధాన్ని గుర్తించి, అధ్యయనం చేసినప్పుడే భాషాశాస్త్రాన్ని, దాని అభివృద్ధి సూత్రాలనూ మనం అర్థంచేసుకోగలం.

ప్రజలు ఒకరితో ఒకరు సంబంధం పెట్టుకోడానికీ, ఒకరి భావాలను మరొకరికి చెప్పుకొని, ఒకరినొకరు తెలుసుకోడానికీ భాషసాధనం; మార్గంకూడా. భాష, ఆలోచనతో ప్రత్యక్షసంబంధం కలిగివుండటంవల్ల, ఆలోచనల వల్ల కలిగిన ఫలితాలనూ, మానవుని గ్రహణశక్తివల్ల సాధించిన విజయాలనూ పదాల్లోను, పదాలపొందికతో వాక్యాల్లోను కూర్చి, స్థిరపర్చి, మానవ సమాజంలో ఒకరిభావాల్ని మరొకరికి చెప్పుకోడానికి అనువుగా తయారుచేస్తున్నది.

ఒకరి అభిప్రాయాలను మరొకరికి చెప్పుకోవడమనేది సమాజానికి ఎప్పుడూ ముఖ్యావసరమే. అలా చెప్పుకోకపోతే ప్రకృతిశక్తులతో జరిగే సంఘర్షణలోనూ, అత్యవసరవస్తువుల్ని ఉత్పత్తిచేయడానికైన పోరాటంలోనూ ప్రజలసమిష్టి చర్య అసంభవ మౌతుంది. సమాజంయొక్క ఉత్పత్తి కార్యాచరణలో విజయం అసాధ్యమౌతుంది. తత్ఫలితంగా అసలు సామాజిక ఉత్పత్తే లేకుండా పోతుంది. కనుక సమాజానికంతకీ అర్థమయ్యే సామాన్యభాష లేకపోతే, సమాజంలో ఉత్పత్తే స్తంభించి, ఛిన్నాభిన్నమై, సమాజంయొక్క మనుగడకే భంగంవాటిల్లుతుంది. ఈదృష్టితో చూస్తే భాషవ్యవహార నిర్వహణకైన సాధనమేకాక సమాజంయొక్క అభివృద్ధిలోనూ, పోరాటంలోనూకూడ ఒక ముఖ్యమైన సాధనమవుతున్నది.

భాషలోవున్న పదాలన్నీ కలసి, భాషయొక్క పదజాలంగా తయారౌతున్నాయని మనం చూస్తున్నదే. భాషలోని పదజాలంలో ప్రధానమైనటువంటిది మూలపద సంపదే. ఈ మూలపద సంపద భాషలోని యితర పదజాలంకంటే చాల తక్కువగానే వుంటుంది. అయినా, ఇది చాలాకాలం –

శతాబ్దాల తరబడి-నిలిచివుంటుంది. కొత్తపదాలను ఏర్పరచ్చుకో డానికి భాషకు ఆధారంగా వుంటుంది. భాషయొక్క స్థాయిని ప్రతిబింబిస్తూ ఉంటుంది. ఒకదాని కొకటి విభిన్నమైన పద జాలం ఎంత ఎక్కువగావుంటే, అంతఎక్కువగా భాషకూడా అభివృద్ధిపొందినట్లు నిదర్శనం.

అయినా ఒక్క పదజాలం మాత్రమే భాష కానేరదు. పదజాల మనేది భాషకు నిర్మాణపరికరం. గృహ నిర్మాణ పరికరాలు లేకపోతే ఇల్లు తయారు కాకపోయినా, అవే ఇల్లు ఎలా కాలేవో, అలాగే పదజాలం లేకపోతే భాషే లేక పోయినా, పదజాలంమాత్రమే భాష కానేరదు. వ్యాకరణ శాస్త్రదృష్ట్యా భాషలోని పదజాలానికి చాల ప్రాముఖ్యం వుంది. వ్యాకరణశాస్త్రం పద పరిచ్ఛేదాన్ని - అంటే పదాల మార్పిడికి సంబంధించినసూత్రాలనూ, వాక్య సంకలనాన్ని - అంటే వాక్యంలో పదాల్నికూర్చే సూత్రాలనూ నిర్ణయించి, భాషకు ఒక క్రమబద్ధమైన, గ్రాహ్యమైన స్వభావాన్ని యిస్తుంది. పదరూపభేదాన్ని వాక్యంలో పదాలకూర్పునూ నిర్ణ యించే సూత్రాలే వ్యాకరణం. వ్యాకరణం ఉండటంమూలం గానే భాష మానవుని ఆలోచనకు భౌతికమైన ఒక భాషా రూపాన్ని యివ్వగల్గుతున్నది.

ఏవో కొన్ని ప్రత్యేకపదాలను గాకుండా మొత్తం పదాలన్నిటినీ దృష్టిలోపెట్టుకొని, వివరాల్లోకి వెళ్ళకుండా పదాలమార్పును సంబంధించిన నియమాలను సూత్రీకరించడమే వ్యాకరణంయొక్క విశిష్ట లక్షణం. ఈ వ్యాకరణం ప్రత్యేక వాక్యాలను, అంటే ఏదో ఒక కర్తనుగానీ, క్రియనుగానీ దృష్టిలో పెట్టుకోకుండా, అన్నిరకాల వాక్యాలనూ-ఎటువంటి

రూపంలోవున్న వాక్యాన్నైనాసరే-కూర్చడానికి సూత్రాలను ఏర్పాటు చేస్తుంది. అందుచేత ప్రత్యేకమైన, నిర్దిష్టమైన పదాల నుంచీ, వాక్యాలనుంచీ తాను విడివడి, పద పరిచ్ఛేదానికీ, వాక్యాల్లో పదాలకూర్పుకూ పునాదైన సామాన్యలక్షణాన్ని వ్యాకరణం కలిగివుంటుంది. దీంట్లోనుంచి వ్యాకరణ సూత్రాలనూ, వ్యాకరణశాస్త్రాన్నీ ఏర్పరుస్తుంది. అందుచేత మానవుని ఆలోచన దీర్ఘకాలం సాగిస్తూవచ్చిన సూత్రీకరణ ఫలితంగా వ్యాకరణం ఏర్పడింది. ఆలోచనయొక్క అద్భుత విజయాలకు యిదొక తార్కాణం.

ఈ విషయంలో వ్యాకరణం రేఖా గణితాన్ని జ్ఞప్తికి తెస్తుంది. రేఖాగణితం నిర్దిష్ట వస్తువులనుంచి వేరుబడి కొన్ని సూత్రాలను నిర్మిస్తుంది. పదార్థాలను స్పష్టతలేని వస్తువులుగా భావిస్తుంది. వాటి మధ్యగల సంబంధాలను నిర్దిష్ట పదార్థాల మధ్యగల నిర్దిష్ట సంబంధాలవలెగాక, ఏమాత్రమూ స్పష్టత లేని వస్తువుల మధ్య సంబంధాలవలె భావిస్తుంది.

కట్టడం ఉత్పత్తితో సరాసరి సంబంధం కలిగివుండక, ఆర్థికవిధానంద్వారా సంబంధంకలిగివుంటుంది. భాష యిందుకు వ్యతిరేకంగా, మానవుని ఉత్పత్తి కార్యాచరణతో ప్రత్యక్ష సంబంధం కలిగివుంది. వివిధరంగాల్లోని మానవుని కార్యాచరణతో ఎట్టి మినహాయింపూ లేకుండా భాషకు ప్రత్యక్ష సంబంధం వున్నట్లే యిదికూడా వుంది. భాషలోని పదజాలం మార్పుకు అతిత్వరగా లొంగిపోయే స్వభావంకలిగి, దాదాపు ఎప్పుడూ మారుతూవుంటుంది. ఇంతేకాదు. భాష కట్టడం వలె కాకుండా పునాది నిర్మింపబడకముందే, పునాదితో

సంబంధం లేకుండానే తన పదజాలంలో మార్పుల్ని ప్రవేశ పెడుతుంది.

ఇంతేకాదు. భాషలోని పదజాలం కట్టడంవలె పాత దాన్ని నిర్మూలించి, కొత్తదాన్ని నిర్మించడంద్వారా మార్పు చెందదు. సామాజికవిధానంలోని మార్పులవల్ల, ఉత్పత్తిలోని అభివృద్ధివల్ల, సంస్కృతి, విజ్ఞానం మొదలైనవాటిపెంపుదలవల్ల ఏర్పడిన కొత్త మాటల్ని చేర్చుకోడంద్వారా పదజాలం మారుతూ వుంటుంది. ఇంతేకాదు. భాషలోని పదజాలం నుంచి వాడుకలోలేని కొన్నిపదాలు అడుగున పడిపోతున్నా, అంతకంటే చాల ఎక్కువగా కొత్తపదాలు వచ్చి కలుస్తాయి. మూల పదసంపదమాత్రం చాలమట్టుకు నిలకడగావుండిపోయి, పదజాలానికి పునాదిగా ఉపయోగపడుతూ వుంటుంది.

ఇది సమంజసమైనదికూడా. అనేక చారిత్రిక కాలాల పాటు యీ పదజాలాన్ని విజయవంతంగా ఉపయోగించగలిగి నప్పుడు, పదజాలంయొక్క మూలనిధిని ధ్వంసంచేయవలసిన అవసరమేమీలేదు. శతాబ్దాలుగాఏర్చికూర్చిన మూల పద సంప దను నాశనంచేస్తే తక్కువ వ్యవధిలో కొత్తమూలపదజాలాన్ని తయారుచేయలేక పోవడం, భాష స్తంభించి పోవడం, ప్రజల మధ్యవున్న సంబంధాలన్నీ పూర్తిగా తెగిపోవడం - ఇదంతా జరిగి తీరుతుంది. ఈ సంగతి వేరే చెప్పనక్కర్లేదుకూడ.

పదజాలంయొక్క మూలనిధికంటె చాల నెమ్మదిగా వ్యాకరణ స్వరూపం మారుతూ ఉంటుంది. యుగయుగాల గమనంలో అభివృద్ధి పొందుతూ, భాషలో అంతర్భాగమై పోవడంవల్ల మూలపదజాలంకంటేకూడ బహునెమ్మదిగా వ్యాకరణం మారుతూవుంది. కాలక్రమేణా వ్యాకరణంకూడ

మార్పులు పొందుతుంది. లోటుపాట్లను సవరిద్దుకుంటుంది. సూత్రాలను అభివృద్ధిచేసుకుంటుంది. వాటిని మరింత స్పష్టీకరిస్తుంది. కొత్తసూత్రాలతో పెంపొందుతుంది. కాని వ్యాకరణంయొక్క పునాదులుమాత్రం చాలదీర్ఘకాలంనుంచి నిలకడగానే వుండిపోయాయి. చరిత్ర చూపెడుతున్నట్లుగా, ఆ పునాదులు మరికొన్ని యుగాలపాటు సమాజానికి విజయవంతంగా ఉపయోగపడగలవు.

అందుచేత భాషలోని వ్యాకరణ స్వరూపమూ, మూలపదజాలమూ భాషకు పునాదిగానూ, భాషలోని ప్రత్యేకలక్షణాల సారాంశంగానూ తయారౌతాయి.

భాషను బలవంతాన తారుమారుజేయడానికి ప్రయత్నిస్తే సుస్థిరత్వాన్నీ, అద్భుతమైన ప్రతిఘటననూ ప్రదర్శించినట్లు చరిత్ర చాటుతున్నది. కొంతమంది చరిత్రకారులు యీ యదార్థఘటనను వివరించడానికి బదులు ఊరికే విస్తుపోతారు. నిజానికి అలా విస్తుపోవలసిన అగత్యమేమీలేదు. వ్యాకరణ స్వరూపంయొక్క, మూలపదజాలంయొక్క స్థిరత్వం మీదనే భాషయొక్క స్థిరత్వంకూడా ఆధారపడి ఉంటుంది. బాల్కన్ ప్రజల భాషల్ని ఛిన్నాభిన్నం చేయడానికి, ధ్వంసంచేయడానికి, రూపుమాపడానికి టర్కిష్ దురాక్రమణ దారులు వందలసంవత్సరాలు ప్రయత్నించారు. ఆ సమయంలో బాల్కన్ భాషల పదజాలం తీవ్రమైన మార్పులను గురికావలసివచ్చింది. కొత్తటర్కిష్‌పదాలు, ప్రయోగాలు స్వీకరించబడ్డాయి. కొన్నిమాటలు "పోయినవీ", కొన్నిమాటలు "కలిసినవీ" వున్నాయి. అయినా, బాల్కన్ భాషలుమాత్రం యథాస్థానంలో సజీవంగానే ఉన్నాయి. ఎందుకని? ఆభాషలయొక్క

వ్యాకరణ స్వరూపం, మూలపదసంపద మొత్తంమీద నిల కడగా ఉండటమే యిందుకుకారణం.

దీన్నిబట్టి భాష, దానిస్వరూపం ఏదో ఒకయుగంలో మాత్రమే తయారైనట్లు పరిగణించకూడదని తెలుస్తున్నది. భాషాస్వరూపం, వ్యాకరణ నిర్మాణం, మూలపదజాలం - యివన్నీ అనేక శతాబ్దాల కాలంలో రూపొందినవే.

బానిసయుగంకంటే ముందున్న ఆదిమ సమాజంలోనే ఆధునిక భాషకు అంకురాలు ఏర్పడ్డాయని అనుకోవచ్చు. బహు తక్కువ పదజాలం మాత్రమే వుండటంవల్ల ఆరోజుల్లో భాష క్లిష్టంగా వుండేదికాదు. కాని దానికి ఒకస్వంతవ్యాకరణ స్వరూపం వుండేది. ఇది చాల ప్రాథమికమైనదే కావచ్చుగాని, మొత్తంమీద ఒక వ్యాకరణ స్వరూపమే.

ఉత్పత్తిలో యింకోధికమైన అభివృద్ధి, వర్గాలపుట్టుక, వ్రాతపూర్వకమైన భాష బయలుదేరడం, తన పరిపాలనకు గాను ఎంతో ఒకంత నిర్మాణయుతమైన వ్రాతతో పనివుండే ప్రభుత్వం ఏర్పడటం, ఇంతకంటేకూడ ఎక్కువ వ్రాతపని అవసరమైన వ్యాపారం వృద్ధిపొందడం, అచ్చు యంత్రాలు రావడం, సాహిత్యం బయలుదేరడం - ఇవన్నీ భాషా వికాసంలో గొప్ప మార్పులు తీసికొచ్చాయి. ఆరోజుల్లో తెగలు, జాతులు చినచిన్న ముక్కలుగా చీలిపోయి, అటూయిటూ వ్యాపించి, ఒకదాంతో ఒకటి కలిసిసంకరమై, కాలక్రమేణా, జాతీయభాషలు, ప్రభుత్వయంత్రాలు ఏర్పడసాగాయి. విప్లవ తిరుగుబాట్లు జరిగాయి. పాతసామాజిక వ్యవస్థల స్థానంలో కొత్తవి వచ్చాయి. ఇవన్నీ భాషలోనూ, భాషావికాసం లోనూ మరింత పెద్దమార్పులు తీసికొచ్చాయి.

ఏమైనప్పటికీ, ఉన్నదాన్ని ధ్వంసంచేసి, కొత్తదాన్ని నిర్మించడంతో కట్టడం అభివృద్ధిపొందినట్టుగానే భాషకూడా అభివృద్ధి పొందిందనుకోవడం పెద్ద పొరబాటవుతుంది. వాస్తవానికి పాతభాషను ధ్వంసంచేసి, కొత్తభాషను ఏర్పర్చుకోవడం మూలంగా భాష అభివృద్ధిపొందలేదు. తనలోని ప్రధానాంకురాలను పోషించుకొని, పెంపొందించుకోవడం ద్వారానే భాష అభివృద్ధి పొందింది. ఇంతేకాదు. భాషయొక్క ఒకగుణం మరోగుణంలోకి మారడమనేది పాతది ఒక్కసారిగా బ్రద్దలైపోవడంవల్లగానీ, లేక ఒక్కవేటుకి పాతదాన్ని విచ్ఛిన్నంచేసి, కొత్తదాన్ని నిర్మించడంవల్లగానీ జరగలేదు. కొత్తగుణానికి సంబంధించిన అంకురాలను నెమ్మదినెమ్మదిగా చాలకాలంపాటు కూడబెట్టడంవల్లా, పాతగుణానికి సంబంధించిన అంకురాలు క్రమక్రమంగా నాశనమైపోవడంవల్లా భాష కొత్తరూపం తీసుకుంటూ వచ్చింది.

దశలు దశలుగా అభివృద్ధిపొందుతూ ఉంటుందనే సిద్ధాంతం మార్క్సిస్టుసిద్ధాంతమనీ, పాతగుణంలోనుంచి కొత్తగుణంలోకి భాషపరిణామం చెందడానికి, ఒక్కసారిగా బ్రద్దలైపోవడం అవసరమంటూ ఒకషరతుగా మార్క్సిజం చెబుతున్నదనీ కొంతమంది అంటున్నారు. ఈ సిద్ధాంతంలో వెదకి పట్టుకుందామన్నా మార్క్సిస్టు లక్షణాలు కనపడటంలేదు. అందుచేత శుద్ధతప్పని వేరేచెప్పనక్కర్లేదు. ఈదశలవారీ సిద్ధాంతం భాషాపరిణామ చరిత్రలో ఆకస్మిక విధ్వంసాన్ని గుర్తించే మాటయితే దానికొక నమస్కారం. భాషాభివృద్ధిలో ఆకస్మిక విధ్వంసనాన్ని, అమల్లోవున్న భాషను అకస్మాత్తుగ నాశనం చేయడాన్నీ, కొత్తభాషను హఠాత్తుగా సృష్టించడాన్ని

మార్క్సిజం ఒప్పుకోదు. ఫ్రాన్సులో “1789-1794 సంవత్సరాలమధ్య భాషలో అకస్మాత్తుగా విప్లవంవచ్చిందని లెఫార్గ్యు చెప్పడం సరైనదికాదు. (“భాషావిప్లవం” అనే పుస్తకంలో) ఆరోజుల్లో ఫ్రాన్సులో భాషావిప్లవం జరగనేలేదు. ఆకస్మిక విప్లవమనేది అసలేలేదు. అప్పుడు జరిగిందల్లా ఫ్రెంచిభాషలోని పదజాలం బాగా అభివృద్ధయింది. కొత్తమాటలు, కొత్తపద ప్రయోగాలు ఏర్పడ్డాయి. వాడుకలోలేని కొన్నిపదాలు వదిలేయ బడ్డాయి. కొన్నిమాటల అర్ధాలు మారిపోయాయి. అంతే. అలాంటి మార్పులుమాత్రం భాషయొక్క భవితవ్యాన్ని నిర్ణయించలేవు. వ్యాకరణస్వరూపం, మూలపదజాలం భాషకు ప్రధానమైనవి. ఫ్రెంచి బూర్జువావిప్లవం జరిగినరోజుల్లో ఫ్రెంచిభాషలోని వ్యాకరణ స్వరూపంగానీ, మూలపదజాలం గానీ ఏమీ మారలేదు. ఎలాంటి ముఖ్యమైన మార్పులూ లేకుండా, అవి, యథాప్రకారంగానే వుంచబడ్డాయి. ఊరికే అలావుంచడమేకాదు. నేటికాలపు ఫ్రెంచి భాషలోకూడా, అవి జీవంగానే వుంటున్నాయి. అమల్లోవున్న భాషను నాశనంచేసి, కొత్తజాతీయభాషను సృష్టించాలంటే (“భాషలో ఆకస్మిక విప్లవం”) అయిదారు సంవత్సరాలకాలం ఏమీ చాలదు. కొన్ని శతాబ్దాలు కావలసివుంటుంది.

భాష పాతగుణంనుంచి కొత్తగుణంలోకి మారడమనేది విధ్వంసంద్వారా జరగదనీ, అమల్లోవున్న భాషనునాశనంచేసి, కొత్తభాషను నిర్మించడంద్వారా భాష పరిణామం చెందదనీ, కొత్తగుణానికి సంబంధించిన అంకురాలను క్రమక్రమంగా కూడబెట్టడంద్వారానూ, పాత గుణానికి సంబంధించిన అంకు

రాలు క్రమక్రమంగా నాశనమవడం ద్వారానూ మాత్రమే భాష పరిణామం చెందుతుందనీ మార్క్సిజం చాటుతోంది.

ఒక్కసారి విధ్వంసం చేయడంద్వారానే పాతగుణం నుంచి కొత్తగుణంలోకి పరిణామం జరుగుతుందనే సూత్రాన్ని పట్టుకొని వ్రేళ్లాడే కామ్రేడ్సుకు ఒకసంగతి చెప్పాలి. భాష యొక్క అభివృద్ధిచరిత్రలో ఆ సూత్రం అన్వయించదు. అంతేగాదు. ఇతర సామాజిక దృగ్విషయాల్లోకూడా, అంటే పునాదికీ, కట్టడానికీ సంబంధించిన విషయాల్లోకూడా యీ సూత్రాన్ని ఎల్లప్పుడూ అన్వయించడానికి వీల్లేదు. పరస్పర విరుద్ధమైన వర్గాలతో విభజించబడిన సమాజానికి యీసూత్రం అవసరమేగాని, పరస్పర విరుద్ధమైన వర్గాలులేని సమాజానికి మాత్రం యిది ఉండవలసిన అవసరంలేదు.

మనదేశంలోని వ్యవసాయాన్ని 8-10 సంవత్సరాల్లో బూర్జువా వ్యక్తిగత ఆస్తివిధానంనుంచి, సోషలిస్టు సమిష్టి వ్యవసాయ పద్ధతిలోకి మనం మార్చాం. పాత బూర్జువా ఆర్థిక వ్యవస్థను నాశనంచేసి, కొత్త సోషలిస్టువ్యవస్థను నిర్మించిన విప్లవం అదే. అయినా, యీ విప్లవం అకస్మాత్తుగా బ్రద్దలై ఒక్కసారిగా జరగలేదు. అప్పటిదాకావున్న వ్యవస్థను కూల దోసి, కొత్త వ్యవస్థను స్థాపించడం ద్వారానే జరగలేదు. దేశమంతటా పాతబూర్జువా వ్యవస్థనుంచి కొత్త సోషలిస్టు వ్యవస్థలోకి క్రమక్రమంగా పరిణామం చెందడంద్వారానే వ్యవ సాయంలో యీ విప్లవం వచ్చింది. రైతాంగంయొక్క సహ కారంతో అధికారంలోవున్న పక్షం పూనుకొని, పైనుంచి విప్లవం తీసుకురావడంవల్లనే యిలాంటి మార్పు సాధ్యమైంది.

చరిత్రలో భాషల్ని సంకరంచేసిన ఘటనలు చాల ఉన్నాయంటూ విధ్వంసం చేయడంద్వారా కొత్తభాషను సృష్టించవచ్చుననీ, పాతగుణంనుంచి కొత్తగుణంలోకి హఠాత్తుగా మార్పు చెందడంద్వారా కొత్తది ఉద్భవిస్తుందనీ కొందరు చెబుతున్నారు. ఇదికూడా శుద్ధతప్పే.

భాషను సంకరంచేయడంద్వారా కొద్దిసంవత్సరాల్లోనే చక్కటి ఫలితం కలుగుతుందనుకోడానికి వీల్లేదు. భాషా సంకరమనేది వందలకొలది సంవత్సరాలపాటు చేయవలసిన సుదీర్ఘ కార్యక్రమం. అందుచేత యీ విషయంలోకూడ ఆకస్మిక పరిణామానికి ఆస్కారంలేదు.

ఇంతేకాకుండా, రెండుభాషల్ని సంకరంచేసి మూడో భాష నొకదాన్ని – కొత్తదాన్ని – నిర్మించవచ్చుననీ, ఆ కొత్త భాషకు ఆ మొదటిభాషలతో పోలికవుండదనీ, ఆ రెండుభాషల గుణాలకూ విభిన్నమైన గుణం యీ కొత్తభాషకు వుంటుందనీ చెప్పడంకూడ శుద్ధతప్పు. వాస్తవానికి అలా రెండుభాషల్ని సంకరం చేసినప్పుడు, సామాన్యంగా, ఆరెండింటిలో ఒకటి పైచేయి సంపాదించుకుంటుంది. ఆ భాషయొక్క వ్యాకరణ స్వరూపం, మూలపద సంపద అలాగే ఉండిపోతాయి. దాని ఆంతరంగిక పరిణామసూత్రాలననుసరించి అవి మరింత ముందుకు పోతాయి. రెండో భాషమాత్రం తన గుణాన్ని క్రమక్రమంగా కోల్పోతూ, కొంతకాలం గడిచేసరికి అసలే అదృశ్యమైపోతుంది.

అందుచేత యీ సంకరమనేది కొత్తమూడోభాషను దేన్నీ సృష్టించదు. ఆ కలిసిన భాషల్లోనే ఒకదాన్ని కాపాడుతుంది. ఆభాషయొక్క వ్యాకరణస్వరూపాన్నీ, మూలపద

సంపదనూ నిలబెడుతుంది. ఆంతరంగిక పరిణామసూత్రాల ననుసరించి ఆ భాష పెంపొందడానికి సహాయపడుతుంది.

ఈ పరిణామంలో పైచేయి సంపాదించినభాష అడుగున పడిపోయిన భాషనుంచి పదాలను తీసికొని, తనపదసంపదను పెంపొందించుకుంటూ వుంటుందనేమాట వాస్తవం. అంత మాత్రాన, అంటే యితరభాషలనుంచి పదాలను తీసుకున్నంత మాత్రాన, యీ భాష క్షీణించదు. పైగా మంచిపుష్టినీ, సౌష్ఠవాన్నీ పొందుతుంది.

చారిత్రికాభివృద్ధిలో యితర ప్రజల భాషలనేకం రష్యన్ భాషతో సంకరమయ్యాయి. అలా సంకరమైన ప్రతిసందర్భంలోనూ రష్యన్ భాషదే పైచేయి అవుతూ వచ్చింది.

రష్యన్ భాషకూడ యీ పరిణామంలో యితర భాషల పదజాలంనుంచి మాటల్ని తీసుకుంటూ, తన పదజాలాన్ని పెంపొందించుకున్నమాట వాస్తవమే. అందుచేతనే రష్యన్ భాష క్షీణించి పోకుండా మంచి పుష్టినీ, సౌష్ఠవాన్నీ పొందింది.

రష్యన్ భాష తన వ్యాకరణస్వరూపాన్నీ, తనమూలపద సంపదనూ కాపాడుకోవడంవల్ల తన జాతీయస్వరూపాన్నికూడా ఏమీ కోల్పోలేదు. ఆంతరంగిక పరిణామసూత్రాన్ని అనుసరించి లోపాలను సరిదిద్దుకుంటూ రష్యన్ భాష రోజురోజుకూ ముందుకు పోతూనేవుంది. అందుచేత భాషలు సంకరమౌతాతాయనే యీ సిద్ధాంతం సోవియట్ భాషా శాస్త్రానికి కొత్తగా సహాయపడేదేమీలేదు. భాషా పరిణామసూత్రాలను అధ్యయనం చేయడం భాషాశాస్త్రంయొక్క ప్రధాన కర్తవ్యమనేమాట వాస్తవమైతే, ఆ కర్తవ్యాన్ని భాషలు సంకరం

చెందుతాయనే సిద్ధాంతం నిర్వర్తించలేము. సరిగదా, అర్థంచేసుకోనూలేదు; పరిశీలించనూలేదు; గుర్తించనూలేదు.

ప్రశ్న :—భాషాశాస్త్రానికి సంబంధించిన సమస్యలపై "ప్రవదా" పత్రిక బహిరంగచర్చలను సాగించడం సరైనదేనా ?

జవాబు :—సరైనదే.

చర్చ పూర్తయ్యేసరికి యీ భాషాశాస్త్ర సమస్యలు ఎలా పరిష్కరించబడతాయో స్పష్టమౌతుంది. అయినా యీ చర్చలవల్ల చాలమంచి కలిగిందన్నమాట మాత్రం నిర్వివాదం.

ముఖ్యంగా యీ చర్చల్లో ఒకవిషయం బయటపడింది. కేంద్రంలోనూ, రిపబ్లిక్‌లలోనూ కూడ భాషాశాస్త్రానికి సంబంధించిన శాఖల్లో శాస్త్రంతోగానీ, శాస్త్రజ్ఞులతోగానీ, సంబంధం పెట్టుకోకుండా వ్యవహరిస్తున్న పరిపాలన ఒకటి వ్యాపించివుంది. సోవియట్ భాషాశాస్త్రంలోని కార్యకలాపాలను గురించిన అతి స్వల్పమైన విమర్శనలనూ, భాషాశాస్త్రంలోని "కొత్త బోధనాపద్ధతి" అని చెప్పబడుతున్న దానిపై అతిమర్యాదగా జరుగుతున్న విమర్శనలనూ సైతం ప్రముఖభాషాశాస్త్రజ్ఞులు తీవ్రంగా ఖండించి, ఆపుచేయించారు. యన్. వై. మార్ కనిపెట్టిన సిద్ధాంతాలను విమర్శించినందుకూ, మార్ బోధనలయెడ కాస్త అయిష్టం వెల్లడించినందుకూ భాషాశాస్త్రపరిశోధనల్లో పనిచేస్తున్న రత్నాల్లాంటి

పరిశోధకుల్నీ, తదితరుల్నీ వారి స్థానాలనుంచి తీసేయడమో, తగ్గించడమో జరిగింది. యన్. వై. మార్ సిద్ధాంతాన్ని తు. చ. తప్పకుండా అంగీకరించినవారినే, వారివద్ద అసలు సత్తాలేకపోయినా, ఉన్నతపదవుల్లో ప్రవేశపెట్టారు.

పరస్పరవిరుద్ధమైన అభిప్రాయాల సంఘర్షణ లేనిదే, విమర్శనాస్వాతంత్ర్యం లేనిదే ఏ శాస్త్రమూ అభివృద్ధి పొందదనీ, రాణించదనీ అందరూ అంగీకరిస్తున్న విషయం. సర్వజనాంగీకారమైన యీ సూత్రాన్ని నిర్లక్ష్యంచేసి, అతి నిర్దాక్షిణ్యంగా అడుక్కి తొక్కేశారు. ఎప్పుడూ పొరబాట్లు చేయని నాయకులనేవారు కొందరేర్పడ్డారు. వీరు తమమీద ఏమాత్రం విమర్శ రాకుండా, ముందుగానే జాగ్రతపడి, తమ యిష్టంవచ్చినట్లు తలబిరుసుగా ప్రవర్తించసాగారు.

ఒక ఉదాహరణ తీసుకుందాం. "బాకూకోర్సు"(అంటే బాకూలో యన్. వై. మార్ యిచ్చిన ఉపన్యాసాలు) అనే దాంట్లో చాలా లోపాలు వున్నాయని రచయితే పునర్ముద్రణాన్ని ఆపివేశాడు. అయినా, కొంతమంది నాయకవర్గం సలహామీద (వీళ్ళనే కామ్రేడ్ మెష్చానినోవ్ యన్. వై. మార్ "శిష్యుల"ని పిలుస్తున్నాడు) పునర్ముద్రించారు. ఏమీ వెనకాముందు ఆడకుండా, విద్యార్థులు చదువుకోడానికై సిఫార్సుచేసిన సిలబస్‌లో వీటినికూడా చేర్చారు. అంటే, ఏమీ తప్పులులేని చక్కటి పాఠ్య గ్రంథంలాగ తప్పులతడకమైన యీ "కోర్సు"ను సిఫార్సుచేసి, విద్యార్థులకు అపచారం చేశారు. కామ్రేడ్ మెష్చానినోవ్ నిజాయితీనీ, ఇతర భాషాశాస్త్రజ్ఞుల నిజాయితీనీ నేను విశ్వసిస్తున్నాను.

లేకపోతే వాళ్ళ ప్రవర్తన విధ్వంసచర్యలతో సమానమైనదని చెప్పేవాణ్ణి.

ఇదంతా ఎలాజరిగింది? ఆరక్ చెయేవ్ పరిపాలన, భాషా శాస్త్రంలో బాధ్యతారహితంగా ప్రవర్తించడాన్ని, హద్దులు మీరి సంచరించడాన్ని ప్రోత్సహించి, అలవాటు చేసింది. అందువల్లనే ఇలాంటిది జరిగింది.

ఈచర్చ జరగడంమాత్రం చాలమంచిదైంది. ముఖ్యంగా ఆరక్ చెయేవ్ హయాంను నలుగురిలోకి తెచ్చి ఎండేసింది; నిర్మూలించింది. ఇంతేకాదు. ఈ చర్చవల్ల కలిగిన లాభాలు యింకా ఉన్నాయి. భాషాశాస్త్రంలోని పాత పెత్తనాన్ని పూర్తిగా నాశనం చేయడమేగాక, అతిముఖ్యమైన భాషా శాస్త్ర సమస్యలపై ప్రవీణుల్లో వ్యాపించివున్న, నమ్మడానికి వీల్లేనంతటి గందరగోళపు అభిప్రాయాలనుకూడా, యీచర్చ బయటకు తీసుకొచ్చింది. ఈచర్చ జరక్కముందు వాళ్ళు మౌనముద్రవహించి, భాషాశాస్త్రంలో యేర్పడిన దుస్థితిని నలుగురికీ తెలియనివ్వకుండా కప్పెసివుంచారు. చర్చ మొదలెట్టిన తర్వాత మౌనం వహించడం సాధ్యంకాదు. తమ అభిప్రాయాలేమిటో పత్రికాముఖాన నలుగురికీ చెప్పుకోవలసి వచ్చింది. ఫలితం? యన్. వై. మార్ నేర్పినదాంట్లోవున్న లోపాలు, తప్పులు, అపరిష్కృత సమస్యలు, చివరికళ్ళని ప్రతిపాదనలు బయటపడ్డాయి. అయితే - చర్చ ప్రారంభించిన తర్వాత మాత్రమే యన్. వై. మార్ శిష్యులు బయటకి వచ్చారెందుకని ?—అనే సందేహం వస్తుంది. ఇంతకముందే యీ విషయాన్ని వాళ్ళు ఎందుకు పట్టించుకోలేదు? శాస్త్ర

జ్ఞులకు తగినరీతిగా, బహిరంగంగా, నిజాయితీగా యీ విషయాన్ని నలుగురిలోనూ ఎందుకుపెట్టలేదు ?

యన్. వై. మార్ చేసిన "కొన్ని" తప్పుల్ని అంగీకరించినతర్వాతకూడా, తాము మార్క్సిస్టు సిద్ధాంతమని భావస్తున్న అతని సిద్ధాంతానికి "మెరుగులుపెట్టడం" ద్వారానే సోవియట్ భాషాశాస్త్రాన్ని అభివృద్ధి పర్చవచ్చునని అతని "శిష్యులు" భావిస్తున్నట్టువున్నది. యన్. వై. మార్‌కూ, అతని "మార్క్సిజా"నికీ ఒక నమస్కారం. యన్. వై. మార్ నిజంగానే మార్క్సిస్టుగా తయారుకావాలని తంటాలుపడ్డాడు. కాని, పాపం! ఆ గమ్యం చేరుకోలేకపోయాడు. "ప్రొలెట్ కుల్టోవ్ట్సీ" "రాపొవిట్సీ"లవలె యితను చేసిందంతా, మార్క్సిజాన్ని అతి చులకనచేసి, తప్పులతడకగా తయారుచేయడమే.

యన్. వై. మార్ భాషను ఒక కట్టడంగా పరిగణిస్తూ భాషాశాస్త్రంలో మార్క్సిస్టు సూత్రాలకు విరుద్ధమైన ఒక తప్పుడుసూత్రాన్ని ప్రవేశపెట్టాడు. దాంతో తాను వుక్కిరిబిక్కిరై, భాషాశాస్త్రాన్ని కూడ గందరగోళపర్చాడు. ఒక తప్పుడుసూత్రాన్ని ఆధారంచేసుకొని సోవియట్ భాషాశాస్త్రాన్ని ఎన్నడూ అభివృద్ధిచేయలేము.

యన్. వై. మార్ "వర్గ" భాషనుగురించి భాషాశాస్త్రంలో మార్క్సిస్టు సూత్రాలకు విరుద్ధమైన మరో తప్పుడు సూత్రాన్నికూడా లేవదీశాడు. దాంతో తాను ఉక్కిరిబిక్కిరై, భాషాశాస్త్రాన్నికూడ ఉక్కిరిబిక్కిరి చేశాడు. ప్రజలయొక్క, భాషయొక్క మొత్తం చారిత్రికగమనానికే విరుద్ధమయిన ఒక తప్పుడుసూత్రాన్ని ఆధారంచేసుకుని, సోవియట్ భాషాశాస్త్రాన్ని ఎన్నడూ అభివృద్ధిచేయలేము.

యన్. వై. మార్ భాషాశాస్త్రంలో మార్క్సిజానికి విరుద్ధమైన అవిధేయతనూ, ఆత్మస్తుతినీ, తలబిరుసుతనాన్నీ ప్రవేశపెట్టాడు. భాషాశాస్త్రంలో తనకు ముందున్న దాన్నంతనూ, మొత్తంగా, చులకనభావంతో నిరాకరించడానికి యీ వైఖరే కారణం.

యన్. వై. మార్ తారతమ్య చారిత్రక పరిశీలనా పద్ధతిని (అంటే వివిధదేశాల, వివిధదశల భాషలను పోల్చి, పరిశీలించే పద్ధతి) "భావవాద"మని దురహంకారంతో నిరాకరించాడు. ఎన్నిలోట్లున్నా యీ తారతమ్య చారిత్రిక పరిశీలనా పద్ధతి మార్ యొక్క నిసలైన భావవాదపు చతుర్లక్షణ పరిశీలనకంటే చాలా మెరుగు. మొదటిది కష్టపడి భాషలను అధ్యయనం చేయడాన్ని ప్రోత్సహిస్తుంది. రెండవది (అంటే మార్ సిద్ధాంతం) పొయిదగ్గర నోరెల్లబెట్టుకు కూర్చొని, అప్రతిష్ఠపాలైన చతుర్లక్షణాలను గురించి టీకప్పులతో మంతనాలాడమంటుంది.

భాషాకుటుంబాలను అధ్యయనం చేసే ప్రతిపద్ధతీ "మూలభాషా" సిద్ధాంతం యొక్క మారురూపమేనని యన్. వై. మార్ దురహంకారంతో తృణీకరిస్తున్నాడు. కాని, ఉదాహరణకు స్లావ్ జాతుల భాషలమధ్య ఉన్న సాన్నిహిత్యాన్ని ఎవ్వరూ కాదనలేరు. ఈ జాతులకున్న భాషా బాంధవ్యాన్ని అధ్యయనం చేయడం, భాషయొక్క అభివృద్ధినిగానీ, పరిణామసూత్రాలనుగానీ అధ్యయనం చేయడంలో భాషాశాస్త్రానికి ఎంతో ఉపకరిస్తుంది. "మూలభాషా" సిద్ధాంతానికీ, దీనికీ పొత్తే లేదన్న సంగతి నేను వేరుగా చెప్పనక్కర్లేదు.

యన్. వై. మార్, ముఖ్యంగా అతని "శిష్యులూ" చెబుతున్నదాన్ని వింటుంటే ఈ యన్. వై. మార్‌కుముందు అసలు భాషాశాస్త్రమే లేనట్లూ, మార్ యొక్క "నూతన బోధనల"తోనే భాషాశాస్త్రం అవతరించినట్లూ కన్పడుతుంది. పాపం! మార్క్సు, ఎంగిల్సులుకూడా ఇంతకంటే చాల నమ్రస్వభావులు. తత్వశాస్త్రంతో సహా శాస్త్రాలు పొందిన అభివృద్ధివల్లనే తమ గతితార్కిక భౌతికవాదం ఉత్పన్నమైన దని మార్క్సు, ఎంగిల్సులు విశ్వసించేవారు.

కాబట్టి యీచర్చ సోవియట్ భాషాశాస్త్రంలోవున్న సిద్ధాంతలోపాలను బయటికి తీసుకురావడం మూలంగా మన కెంతో తోడ్పడింది.

భాషాశాస్త్రం యన్. వై. మార్ యొక్క తప్పుల్లో నుంచి ఎంత తొందరగా తప్పించుకు బయటపడితే అంతతొంద రగా, ఇప్పుడున్న ప్రతిష్ఠంభనలోనుంచి బయట పడగలుగు తుంది.

భాషాశాస్త్రంలో అరక్‌చెయేవ్ హయాంను పోగొ ట్టడం, యన్. వై. మార్ చేసిన తప్పుల్ని నిరాకరించడం, మార్క్సిజాన్ని భాషాశాస్త్రానికి అన్వయింపజేయడం ఇదేసోవి యట్ భాషాశాస్త్రాన్ని సరైనస్థితికి తీసుకురావడానికిమార్గంగా నాకు కన్పడుతోంది.

# కొన్ని సందేహాలు - జవాబులు

## క్రాషేనికోవాకు యిచ్చిన జవాబు

ప్రశ్న:- భాష పునాదిగాని, కట్టడంగానీ కాదని మీ వ్యాసం చాలచక్కగా వివరించింది. అయితే భాషను పునాదిగానీ, కట్టడంగాని కాని ఒకవిశిష్ట దృగ్విషయంగా భావించవచ్చునా? లేక పునాదికీ, కట్టడానికీ మధ్య మెట్టుగా ఏర్పడిన మాధ్యమిక దృగ్విషయంగా భావించవలెనా?

జవాబు:— పునాదివలెనూ, కట్టడంవలెనూ ఒక సామాజిక దృగ్విషయమైన భాషకుకూడ యీ క్రింది విశిష్ట లక్షణముంది. పునాది, కట్టడాలతో సహా అన్ని సామాజిక దృగ్విషయాలు సమాజానికి ఉపకరించినట్లుగానే, భాషకూడా సమాజానికి ఉపకరిస్తుంది. అయితే అన్ని సామాజిక దృగ్విషయాల్లోనూ అంతర్గర్భితమైవున్న యీ సాధారణవిషయం మినహా వేరేపోలికలేమీలేవు. ఇదికాక, మిగతావాటిల్లో వివిధ సామాజిక దృగ్విషయాలమధ్య తీవ్రమైన వ్యత్యాసాలు ప్రారంభమౌతాయి.

అసలు విషయమేమిటంటే, సామాజిక దృగ్విషయాలు పైన వివరించిన సాధారణ లక్షణంతోపాటు తమ తమ విశిష్ట స్వభావాలనుకూడా కలిగివుంటాయి. ఈవిశిష్ట స్వభావాలేఒక దాన్ని మరొకదానినుంచి వేరుపర్చి తెలుసుకోడానికి ఉపకరిస్తాయి. శాస్త్రవిజ్ఞానానికి యీ విశిష్టలక్షణాలే అన్నిటికంటే ముఖ్యమైనవి. సమాజానికి ఆర్థికంగా ఉపకరించడం, పునాదియొక్క విశిష్ట లక్షణాల ప్రయోజనం. సమాజానికి రాజకీయ, న్యాయవిషయిక, కళావిషయిక భావాలను, తదితర భావాలనూ, వాటితోపాటు, తదనుగుణ్యమైన రాజకీయ, న్యాయవిషయిక సంస్థలనూ, తదితర సంస్థలనూ సృష్టించడం కట్టడంయొక్క విశిష్టలక్షణాల ప్రయోజనం అయినప్పుడు యితర సామాజిక దృగ్విషయాలకంటే విభిన్నమైన భాషాశాస్త్రంయొక్క విశిష్టలక్షణాలేమిటి? ప్రజలు నిత్య వ్యవహారాలు జరుపుకోడానికీ, ఒకరికొకరు అభిప్రాయాలు తెల్పుకోడానికీ, పరస్పరం అర్థం చేసుకోడానికీ, అన్ని కార్యాచరణ రంగాల్లోనూ, అంటే, ఉత్పత్తి - ఆర్థిక సంబంధాలు - రాజకీయాలు - విజ్ఞానం - నిత్య సామాజిక జీవనం - వీటన్నింటిలోనూ సమష్టికృషి నిర్వహించడానికి సమాజానికి భాష ఉపకరిస్తుంది. భాషకు మాత్రమే యీ ప్రత్యేక లక్షణాలున్నాయి. అందుకనే భాషాశాస్త్రమనే ప్రత్యేక శాస్త్రం ద్వారా భాషను మనం అర్థంచేసుకోవాలి. యీ ప్రత్యేక లక్షణాలు లేకపోతే భాషాశాస్త్రం ప్రత్యేకమైన ఉనికినే కోల్పోతుంది.

క్లుప్తంగా చెప్పాలంటే భాషను పునాదులతోగానీ, కట్టడాలతోగాని చేర్చడానికివీల్లేదు. అంతేగాదు; పునాదికీ,

కట్టడానికీ మధ్యవున్న మాధ్యమిక దృగ్విషయంగాకూడా భాషను పరిగణించడానికీ వీల్లేను. అసలు మాధ్యమిక దృగ్విషయాలనేవి లేనేలేవు.

అయితే, ఉత్పత్తిసాధనాలవలె సామాజిక ఉత్పత్తి శక్తుల్లో ఒకదాన్నిగా భాషను పరిగణించవచ్చునా? నిజమే. భాషకూ, ఉత్పత్తిసాధనాలకూ, ఒక పోలికకూడావుంది. భాషలాగానే ఉత్పత్తిసాధనాలుకూడా వర్గాలయెడ ఒకరకమైన ఉపేక్షాభావాన్ని ప్రదర్శిస్తాయి. సమాజంలోని అన్ని వర్గాలకు పాతవాటికీ, కొత్తవాటికీకూడా - ఇవి సమంగానే ఉపకరిస్తాయి. అయితే యింతమాత్రాన భాషను ఉత్పత్తి సాధనాల్లో ఒకటిగా భావించవచ్చునా? లేదు; అలాభావించడానికి వీల్లేదు.

"భాష పునాదిపైన నిర్మించబడ్డ ఒక కట్టడం" అనే తన సిద్ధాంతం తీవ్రమైన వ్యతిరేకతకు గురి అవుతున్నదని గ్రహించి ఒకప్పుడు యన్. వై. మార్ తన సిద్ధాంతాన్ని "సవరించాల"నుకున్నాడు. ఆ సందర్భంలో "భాష ఒక ఉత్పత్తి సాధనం" అన్నాడు. ఇలా భాషను ఒక ఉత్పత్తిసాధనంగా మార్ పరిగణించటం సరైనదేనా? కాదు. ఎంతమాత్రమూ కాదు.

అసలువిషయమేమిటంటే భాషకూ, ఉత్పత్తి సాధనాలకూ గల సామ్యం నేను పైన వివరించిన పోలికతోనే ఆఖరై పోతుంది. అటుపైన ఆ రెండింటికీ మధ్య తీవ్రవిభేదం ఏర్పడుతుంది. ఉత్పత్తిసాధనాలు భౌతికసంపదను సృష్టిస్తాయి; భాష దేనినీ ఉత్పత్తిచేయదు. లేక, మాటల్ని మాత్రమే "ఉత్పత్తి" చేస్తుంది. ఇంకా స్పష్టంగాచెప్పాలంటే ఉత్పత్తి

సాధనాలు కలిగినప్రజలు భౌతికసంపదను సృష్టించగలరు. అదే ప్రజలు ఉత్పత్తిసాధనాలేమీలేకుండా ఒక భాషను మాత్రమే కలిగివుంటే భౌతికసంపదను సృష్టించలేరు. భాష గనుక భౌతికసంపదను సృష్టించగలిగినట్లయితే వదరుబోతులు ప్రపంచంలో అందరికంటే ధనవంతులు అయ్యేవారనే విషయం సుస్పష్టమే.

2వ ప్రశ్న:— మార్క్సు, ఎంగిల్సులు భాషను "ఆలోచనయొక్క ప్రత్యక్ష వాస్తవికత" అని "కార్య రూపమైన...యదార్థమైన చైతన్య" మని నిర్వచించారు.

మార్క్సు యిలా అన్నాడు: "భాషనుంచి విడివిడి భావాలు జీవించలేవు." మీ వుద్దేశంలో భాషాశాస్త్రంశబ్దార్థ విభాగంతోనూ, శబ్దార్థశాస్త్రంతోనూ, శైలీగతిశాస్త్రం తోనూ ఎంతవరకుజోక్యంపెట్టుకోవాలి? లేక భాషాశాస్త్రం కేవలం స్వరూపచర్చకుమాత్రమే పరిమితమై వుండాలా?

జవాబు: శబ్దార్థశాస్త్రం భాషాశాస్త్రంలోని ముఖ్య విభాగాల్లో ఒకటి. భాషను అధ్యయనం చేయడానికి మాటల యొక్క పదప్రయోగాలయొక్క అర్థం ఎలా మారుతూ వచ్చిందో తెలుసుకోవడం చాలా అవసరం కనుక, భాషా శాస్త్రంలో శబ్దార్థ శాస్త్రానికి అర్హస్థానం ఉండాలి.

అయినప్పటికీ, శబ్దార్థశాస్త్రానికి సంబంధించిన సమ స్యల్ని పరిష్కరించేటప్పుడు, సమాచారాన్ని ఉపయోగించు కొనేటప్పుడు, దాని ప్రాముఖ్యతను ఎక్కువ అంచనా వేయ

రాదు. దుర్వినియోగపర్చటం అసలే పనికిరాదు. నాకు తెలిసిన భాషాశాస్త్రజ్ఞులు కొందరు శబ్దార్థశాస్త్రానికి అతిప్రాముఖ్యత నిచ్చి, ఆలోచనతో అవినాభావ సంబంధంకలిగిన, "ఆలోచన యొక్క ప్రత్యక్ష వాస్తవికత"మైనభాషను తృణీకరిస్తున్నారు. వీరు భాషనూ, ఆలోచననూ వేరుచేసి, భాష తన కాలానికి మించి జీవించివుంటుందనీ, భాషలేకుండానే వ్యవహారం జరుపుకోవచ్చనీ వాదనలు చేస్తున్నారు. యన్. వై. మార్ ఏమంటున్నాడో వినండి. "ధ్వనిరూపంలో వ్యక్తమౌతుంది కనుకనే భాష జీవించివుంది. ఆలోచనాక్రమం బహిర్గతం కాకపోయినా జరుగుతూనేవుంటుంది వాచకమైనభాష తన విధులను అప్పుడే నూతన పరిశోధనలకు వదలివేస్తోంది. ఈ నూతన పరిశోధనలు పరిమితిలేకుండా విశ్వవ్యాపిత మౌతున్నాయి. ఆలోచనాక్రమం ఉన్నతస్థాయికివెళ్తూ, తానుపయోగించని అనవసర సంచితాలను వదలుకుంటూ, నూతన స్వభావాలను పొందుతూ భాషను దానిస్థానంలోనుంచి పూర్తిగా తొలగించివేస్తుంది. సహజసిద్ధమైన పదార్థంనుంచి విడివడి తన ప్రత్యేక నైపుణ్యాన్ని వృద్ధిచేసుకుంటున్న ఆలోచనాక్రమమే భవిష్యత్తులో భాష కాగలదు. ప్రకృతిసిద్ధమైన ప్రమాణాలతో సంబంధం కలిగివున్న వాచకభాషసైతం యీ నూతనభాష తాకిడికి తట్టుకోలేదు.'' (యన్. వై. మార్ వ్రాసిన సెలెక్టెడ్ వర్క్సనుంచి.)

పైన వివరించబడిన వాక్చమత్కృతినీ, గారడీనీ సామాన్య మానవభాషలో అన్వయించుకుంటే యీ క్రింది నిర్ణయాలు తీయవచ్చు.

1. యన్. వై. మార్ ఆలోచననీ, భాషనీ వేరు చేస్తున్నాడు.

2. ప్రజలమధ్య వ్యవహారనిర్వాహణ, భాషతో ప్రమేయములేకుండా, ఆలోచనారూపంలోనే జరుగగలదని భావిస్తున్నాడు. ఆలోచన ప్రకృతిపదార్థంతో సంబంధంలేకుండా స్వతంత్రంగా ఉంటుందనీ, భాష ప్రకృతి ప్రమాణాలతో సంబంధంలేకుండా స్వతంత్రంగా ఉంటుందనీ అనుకుంటున్నాడు.

3. ఆలోచనను భాషనుండీ, భాషను ప్రకృతిపదార్థం నుండీ వేరుచేయడంతో యన్. వై. మార్ భావవాదపు ఊబిలోకి దిగబడుతున్నాడు.

ఆలోచనలు వాగ్రూపంలో వ్యక్తం కాకపూర్వమే మానవుని మనస్సులో ఏర్పడతాయనీ, భాషావస్తువు లేకుండానే, భాష అనే డిప్ప లేకుండానే, నగ్నస్వరూపంలో ఏర్పడతాయనీ అంటున్నాడు. కాని, యిది పూర్తిగా తప్పు. మానవుని మనస్సులో ఏర్పడే ఆలోచనలన్నీ భాషావస్తువుపై ఆధారపడి, భాషలోని శబ్దాలమీద, సమాసాలమీద ఆధారపడి ఏర్పడతాయి. భాషతో సంబంధంలేకుండా, భాషయొక్క ప్రకృతిపదార్థంతో సంబంధంలేకుండా కేవలం ఆలోచనలేమీ లేనేలేవు. "భాష ఆలోచనయొక్క ప్రత్యక్ష వాస్తవికరూపం" (మార్క్స్). ఆలోచనయొక్క వాస్తవికత భాషారూపంలో వ్యక్తమౌతుంది. ఆలోచనకూ, భాషయొక్క ప్రకృతి పదార్థానికీ ఏసంబంధమూలేదనీ, భాష లేకుండానే ఆలోచన ఉంటుందనీ భావవాదులు మాత్రమే అంటారు.

క్లుప్తంగాచెప్పాలంటే శబ్దార్థశాస్త్రంయొక్క విలువను ఎక్కువ అంచనా వేయడం, దానిని కావలసినదానికంటె

అధికంగా ఉపయోగించటం- ఈ రెండుపొరబాట్లవల్ల యన్.వై. మార్ భావవాదంలోకి యీడ్వబడ్డాడు.

కనుక శబ్దార్ధశాస్త్రాన్ని యన్. వై. మార్, అతని శిష్యులుకొందరూ చేసినట్టు దుర్వినియోగపర్చకపోతే, అతిశయ ప్రాధాన్యత యివ్వకపోతే శబ్దార్ధశాస్త్రం భాషాశాస్త్రానికి ఎంతో ఉపయోగపడుతుంది.

3వ ప్రశ్న :—బూర్జువావర్గము-కార్మికవర్గము పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలనూ, భావనలనూ, అలవాట్లనూ, నీతిసూత్రాలనూ కలిగివుంటాయని మీరు సరిగానే వివరించారు. ఈ దృగ్విషయాల వర్గస్వభావము భాషయొక్క శబ్దార్ధవిభాగాన్ని తప్పనిసరిగా ఆవరించితీరినది. (కొన్ని సందర్భాల్లో - మీ వ్యాసములో చక్కగా నిరూపించబడ్డట్టు భాషయొక్క రూపమైన పదజాలాన్నికూడా ఆవరించినది). నిర్దిష్టమైన భాషావస్తువును పరిశీలించేటప్పుడు, మొట్టమొదటగా భాషయొక్క శబ్దార్ధవిభాగాన్ని పరిశీలించేటప్పుడు, అది వెలిబుచ్చిన భావనలయొక్క వర్గస్వభావాన్ని గురించి చెప్పవచ్చునా? ముఖ్యముగా మానవుని ఆలోచనకు సంబంధించిన భాషాప్రయోగాల్ని మాత్రమేగాక వాస్తవికతను గురించిన అతని వైఖరినీ, అతని వరస్వభావాన్ని స్పష్టముగా ప్రతిబింబించే భాషాప్రయోగాల సందర్భములో వర్గస్వభావాన్నిగూర్చి ప్రస్తావించవచ్చునా?

జవాబు : ముక్తసరిగా చెప్పాలంటే వర్గాలు భాషమీద ప్రభావాన్ని కలిగివున్నవా? అని నీవు తెలిసికోదలిచావు. వర్గాలు భాషకు ప్రత్యేకపదాలను, పదప్రయోగాలను సమకూరుస్తాయా? తమ వర్గస్వభావాన్ని బట్టి ప్రజలు ఒకేరకమైన మాటలకు, పదప్రయోగాలకు వేర్వేరు అర్థాలు ఆపాదిస్తారా? ఇవీ నీవు తెలుసుకోదలచిన ప్రశ్నలు.

అవును. వర్గాలప్రభావం భాషమీద తప్పకుండా పడుతుంది. వర్గాలు ప్రత్యేకమైన పదాలను, పదప్రయోగాలను భాషకు సమకూరుస్తాయి. ఒకేమాటల పదప్రయోగాలు కొన్ని సందర్భాల్లో వేర్వేరు వర్గాలకు వేర్వేరు అర్థాల నిస్తాయి. ఇదంతా నిజమేననడంలో సందేహంలేదు.

అయితే, యిందులోనుంచి యీ క్రిందివ్యాఖ్యానం చేయకూడదు. ఈ ప్రత్యేకమైన పదాలు, పదప్రయోగాలు, శబ్దార్థశాస్త్రింలోని విభేదాలూ ప్రజలందరికీ ఒకే సామాన్య భాషను రూపొందించడంలో చాల ప్రాధాన్యం కలిగివున్నాయనీ, ఆ భాషయొక్క ప్రాధాన్యతను తగ్గించి, దాని స్వభావాన్నే మార్చగలవనీ మాత్రం భావించరాదు.

మొట్టమొదటి విషయం ఏమంటే అట్టి ప్రత్యేక పదాలు, పదప్రయోగాలు, శబ్దార్థశాస్త్రింలోని విభేదాలు భాషలో చాల తక్కువ. మొత్తం భాషావస్తువులో నూటికి ఒకవంతుకూడా లేవు. కనుక అసంఖ్యాకమైన యితరపదాలు, పదప్రయోగాలు, వాటి శబ్దార్థశాస్త్రిం సమాజంలోని అన్ని వర్గాలకు సామాన్యంగానే ఉంటాయి.

రెండో విషయమేమంటే వర్గస్వభావం కలిగిన ప్రత్యేక పదాలు, పదప్రయోగాలు, ఒక ప్రత్యేకవర్గానికి చెందిన

వ్యాకరణ సూత్రాలప్రకారం వాడబడటంలేదు. నిజానికి అట్టి వర్గ వ్యాకరణమే లేదు. ప్రజలందరి సామాన్య భాషయొక్క వ్యాకరణసూత్రాలప్రకారమే యివికూడా వాడబడుతున్నాయి.

కనుక, ప్రత్యేకపదాలు, పదప్రయోగాలు, శబ్దార్థ శాస్త్రంలో విభేదాలు వున్నాయనేవిషయం ప్రజలందరికీ సామాన్యభాష కావాలనేనివిషయాన్ని త్రోసివేయదు. పైగా దాన్ని దృఢపరుస్తుంది.

4 వ ప్రశ్న :—మార్ మార్క్సిజానికి తప్పుడు వ్యాఖ్యానం చేస్తున్నాడని మీ వ్యాసంలో చక్కగా నిరూపించారు. దీని అర్థం కొత్త తరం వాళ్ళమైన మాలాంటి భాషాశాస్త్ర పరిశోధకులు మార్‌యొక్క భాషాశాస్త్ర విజ్ఞాన వారసత్వాన్ని అంతనూ త్రోసివెయ్యాలా? ఎందుకంటే, మార్ భాషాశాస్త్రంలో విలువైన అనేక పరిశోధనా గ్రంథాలు రాశాడు. (కామ్రేడ్ చికోబావా, సంజయేవ్ మొ॥ వారు ఆపుస్తకాలనుగురించి చర్చల్లో పేర్కొన్నారు) మేము మార్‌ను విమర్శాత్మకంగా పరిశీలుస్తూనే ఆయన గ్రంథాలనుంచి విలువైనదాన్ని, ఉపయోగకరమైనదాన్ని స్వీకరించవచ్చునా?

జవాబు: అవును. తప్పకుండా అలానే చేయాలి. యన్. వై. మార్ పుస్తకాల్లో అన్నీ తప్పులుకావు. అతను భాషాశాస్త్రంలోకి మార్క్సిస్టు సూత్రాలను వక్రరూపంలో ప్రవేశపెట్టదలచినప్పుడూ, ఒక స్వతంత్రభాషాశాస్త్రి సిద్ధాం

తాన్ని ఏర్పర్చాలనుకున్నప్పుడూ అతిఘోరమైన పొరబాట్లు చేశాడు. కాని యన్. వై. మార్ కొన్ని చక్కటి ప్రతిభావంతమైన పుస్తకాలు రాశాడు. తన సిద్ధాంత సామర్థ్యాన్ని కాస్త అవతలబెట్టి, బాధ్యతతోనూ, సామర్థ్యంతోనూ, కొన్ని భాషల్ని అధ్యయనం చేశాడు. అలాంటి గ్రంథాల్లో విలువైనవీ, ఉపయోగకరమైనవీ చాలా ఉన్నవి. కనుక యన్. వై. మార్ రచనలనుంచి ఉపయోగకర మైనదాన్నీ, విలువైన దాన్నీ, గ్రహించాలనడం సరైనదే.

5 వ ప్రశ్న :-- సోవియట్ భాషా శాస్త్రంలో ఏర్పడ్డ ప్రతిష్టంభనకు ప్రధాన కారణాల్లో ఒకటి 'ఫార్మలిజం' అని చాలామంది భాషాశాస్త్రజ్ఞులు అభిప్రాయ పడుతున్నారు. (ఫార్మలిజం అంటే భాషలో శబ్దరూపాలకు, వ్యాకరణసూత్రాలకు, పురాతన పదప్రయోగాలకు అనవసరమైన ప్రాముఖ్యమిచ్చేవాదన). భాషాశాస్త్రంలో ఫార్మలిజం (శబ్దఛాందసత్వం) అంటే ఏమిటో, దాన్ని ఎలా అధిగమించాలో అనే విషయంపై మీ అభిప్రాయం తెలుసుకోవాలని వుంది.

జవాబు : యన్. వై. మార్, అతని శిష్యులూ మార్ యొక్క నూతనసిద్ధాంతాన్ని అంగీకరించని భాషాశాస్త్రజ్ఞులందరికీ శబ్దఛాందసత్వం వుందని ఆరోపిస్తున్నారు. ఈ ఆరోపణ నిరాధారం; అర్థరహితం.

వ్యాకరణం అర్థంలేని "అలంకారం"మనీ, భాషకు వ్యాకరణస్వరూపం పునాది అని భావించేవారందరూ శబ్ద

ఛాందసులనీ మార్ అభిప్రాయం. కాని, నిజానికి, యిది కేవలం తెలివితక్కువ అభిప్రాయం.

"నూతనసిద్ధాంతా"న్ని సృష్టించినవారు భాషాశాస్త్రం లోని తమ వ్యతిరేకులతో జరిపే పోరాటంలో తమకు ఉపయోగపడేటందుకుగాను "శబ్దఛాందసత్వం" అనే మాటను సృష్టించారని నా ఉద్దేశం.

సోవియట్ భాషాశాస్త్రంలో ఏర్పడిన ప్రతిష్ఠంభనకు కారణం యన్. వై. మార్, అతని శిష్యులూ కల్పించిన "శబ్దఛాందసత్వం" కాదు. ఆరక్ చేవ్ పీఠాధిపత్యం, తత్ఫలితంగా భాషాశాస్త్రంలో ఏర్పడిన సిద్ధాంతలోపాలూ అందుకు కారణం. యన్. వై. మార్ యొక్క శిష్యులే ఆరక్ చేవ్ పీఠాధిపత్యాన్ని స్థాపించారు. మార్, అతని సన్నిహిత సహచరులే భాషాశాస్త్రంలో సిద్ధాంతగందరగోళాన్ని ప్రవేశపెట్టారు. ప్రతిష్ఠంభనలో నుంచి బయటపడటానికి ఆరక్ చేవ్ పీఠాధిపత్యాన్నీ, మార్ శిష్యులు ప్రవేశపెట్టిన సిద్ధాంత గందరగోళాన్నీ - యీ రెండింటినీ నిర్మూలించాలి. ఈ దుష్ప్రక్రియలను రెండింటినీ సంహరిస్తేనే సోవియట్ భాషాశాస్త్రం తిరిగి రాచబాటలో పడుతుంది. ప్రపంచభాషాశాస్త్రాల్లో ప్రథమస్థానాన్ని ఆక్రమించుకుంటుంది. (జూన్ 29,1950)

ప్రియమైన కామ్రేడ్ సుఝుయేవ్!

నీ ఉత్తరం కేంద్రకమిటీద్వారా నా కందడంలో కొంచెం ఆలస్యమవడంచేత జవాబివ్వడానికికూడా జాగయింది.

ప్రాంతీయ భాషలపై నేను తీసికొన్న విధానాలను గురించి నీవుచేసిన వ్యాఖ్యానం పూర్తిగా సరైనది.

"వర్గ" భాషలు-మరోవిధంగా చెప్పాలంటే కొన్ని అపభ్రంశ భాషలు-ప్రజానీకానికందరికీ పనికివచ్చేవికావు. సమాజంలో పై అంతస్థులోవుండే కొద్దిమందికి మాత్రమే అవి ఉపయోగపడతాయి. పైగా అటువంటిభాషలకు వ్యాకరణ సూత్రాలుగాని, కావలసినంత పదజాలంగాని వుండవు. అందుచేత, అవి, స్వతంత్రభాషలుగా అభివృద్ధి పొందలేవు.

కాని, మాండలిక భాషలు ప్రజలకందరికీ తోడ్పడతాయి. వాటికి వ్యాకరణ సూత్రాలూ, కావలసినంత పదజాలమూ ఉన్నాయి. అందుచేత కొన్ని మాండలికభాషలు జాతులు అభివృద్ధయ్యే క్రమంలో, ఆజాతుల స్వతంత్రభాషలుగా అభివృద్ధయ్యే అవకాశమున్నది. ఉదాహరణకు రష్యన్ భాష యొక్క కుర్స్క - ఓరెల్ మాండలికభాషను చూద్దాం. రష్యన్ భాషకు యీ కుర్స్క - ఓరెల్ మాండలికభాష మొదటిపునాది. అలాగే యుక్రేనియన్ భాషకు పోల్టావా - కీవ్ మాండలికభాష మొదటిపునాది. ఇలా అనేక మాండలిక భాషలు వాటి అభివృద్ధిక్రమంలో జాతీయ భాషలతో సమ్మిళితమై, వాటిలో లీనమైపోతున్నాయి.

కొన్ని సమయాల్లో పైసూత్రాలకు భిన్నంగాకూడ జరగవచ్చు. ఆర్థిక పరిస్థితులు అనుకూలించనందువల్ల ఇంకా ఒక జాతిగా రూపొందని వారి భాషను చూద్దాం. జాతి అభివృద్ధి పొందడానికి అవకాశం లేకపోవడంవల్ల మాండలిక భాషలుకూడా ఒకేఒక భాషలో సమ్మిళిత మవడానికి అవకాశం ఉండదు. అందుచేత అటువంటి మాండలిక భాషలూ స్వతంత్రంగా అభివృద్ధిపొంది, ప్రత్యేక స్వతంత్రభాషలుగా

తయారౌతాయి. ఇట్టి అభివృద్ధికి మంగోలియన్ భాషను ఉదాహరణగా చూపవచ్చు.

కామ్రేడ్స్ బెల్కిన్, ఫ్యూరర్లకు;

మీ ఉత్తరాలందాయి. మీరు రెండువిషయాలను గందరగోళ పర్చారు. దాంతోపాటు నేను ఒకసమస్యపై క్రెషనెన్నికోవాకు యిచ్చిన సమాధానాన్ని యింకోదానితో చేర్చి గందరగోళ పర్చారు.

1. యన్. వై. మార్ భాషను (ధ్వనులు) గురించీ, ఆలోచననుగురించీ మాట్లాడుతూ భాషను ఆలోచన నుంచి వేరుజేసి పూర్తిగా ఆదర్శవాదంలో పడిపోయాడు. నా జవాబులో ఆవిషయాన్ని విమర్శించాను; దాంట్లోనే భాషవున్న మానవులను గురించి నేను చెప్పాను. భాషవున్న మానవులు ఆభాషాసంపదమీద ఆధారపడే అభిప్రాయాలు ఏర్పర్చుకో గలుతారు. భాషాసంపద అనేదిలేకుండా అభిప్రాయాలను ఏర్పర్చుకోవడం సాధ్యంకాదు.

ఈ విషయాన్ని మీరు ఒప్పుకోనైనా ఒప్పుకోవాలి. లేదా తోసెయ్యాలి. అలాకాకుండా భాషలేని మానవులను ఊహించి చెవిటి, మూగ మనుష్యుల్ని దృష్టిలో పెట్టుకుని, భాషాసంపద లేకుండానే అభిప్రాయా లేర్పర్చుకోవచ్చునని మీరనుకుంటున్నారు. నేను దీన్నిగురించి లోగడ చెప్పలేదు; చెప్పవలసిన అవసరంకూడాలేదు. ఎందుకంటే భాషాశాస్త్రాన్ని గురించి తెలుసుకోవలసివచ్చినప్పుడు మనం దృష్టిలో పెట్టుకోవలసింది మాట్లాడగల ప్రజల్నిగురించేగాని, చెవిటి, మూగ లాంటి మాట్లాడటం తెలియని ప్రజలనుగురించికాదు. అందు

చేత మీాకు, మనం చర్చిస్తున్న విషయాన్నిగాక, మరో కొత్త దాన్ని లేవదీశారు.

2. కామ్రేడు బెల్కిన్ వ్రాసిన ఉత్తరంప్రకారం అతను "మాటలభాష"నూ, "సైగలభాష"నూ ఒకేరకంగా చూస్తున్నాడు. "మాటలభాష"నూ, "సైగలభాష"నూ సమాన ఫాయిలాలో చూస్తున్నాడు. మానవ సమాజానికి ఒకప్పుడు "మాటలభాష" అనేది లేదనీ, ఆ రోజుల్లో "సైగలభాష" యిప్పటి "మాటలభాష" యొక్క పాత్రనే నిర్వర్తించిందనీ, తర్వాతనే "మాటలభాష" ఉద్భవించిందనీ కామ్రేడ్ బెల్కిన్ అభిప్రాయం.

కామ్రేడ్ బెల్కిన్ అలా అనుకుంటే, అతను చాల పెద్ద పొరపాటును జేస్తున్నాడని గుర్తించాలి. ఎందుకనంటే మానవసమాజం పుట్టినప్పటినుంచీ ఒకరినొకరు అర్థంచేసుకోడానికి "మాటలభాషను, లేక ధ్వనులభాషను" ఉపయోగిస్తూనే ఉన్నారు. చరిత్ర తెలిసినంతవరకు "ధ్వనులభాషగానీ, మాటలభాష"గానీ లేని సమాజాన్ని మనం ఎరిగివుండలేదు. మానవసమాజ చరిత్రలో ధ్వనులభాషకూడా లేని ప్రజల్ని మనం చూడలేదు. ఆ ప్రజలు ఎంత వెనుకబడివున్నవారైనా సరే, ఆస్ట్రేలియా ఆదిమనివాసులకన్నా వెనుకబడ్డవారైనా సరే, క్రిందటి శతాబ్దానికిచెందిన "టెర్రాడెక్ ఫ్యూగన్సు" కన్నా వెనుకబడ్డవారుకూడా "ధ్వనుల భాషను" కలిగియున్నారు. మానవసమాజ చరిత్రలో "ధ్వనులభాషే" మానవ సమాజాన్ని జంతుసమాజంనుంచి ముందుకు తీసుకొచ్చింది. ఆ "ధ్వనులభాష"వల్లనే మానవులు కొన్ని తెగలుగా ఏర్పడి, తమ మేధస్సును అభివృద్ధిపర్చుకొని సాంఘికోత్పత్తిని నిర్మాణ

రూపంలో పెట్టుకుని, ప్రకృతిపై విజయవంతంగా పోరాటం సాగించి, నేటి అభివృద్ధికర పరిస్థితికి సమాజాన్ని తీసుకు రాగలిగారు.

ఇలాంటప్పుడు "మాటలభాష"తో పోల్చిచూస్తే "సైగలభాష"కు చాలతక్కువ ప్రాధాన్యముందని చెప్పాలి. సరిగా చెప్పాలంటే "సైగలభాష" అనేది అసలు భాషకాదు. భాషలో ఒకభాగంకూడాకాదు. "ధ్వనులభాష" స్థానాన్ని యిది తీసుకోలేదు. "ధ్వనులభాష"కు సహాయకారిగా - అది కూడా చాలతక్కువపరిమితుల్లో- ఉపయోగపడుతుంది. మానవుడు తాను మాట్లాడేటప్పుడు యేదైనా ఒక విషయాన్ని నొక్కి చెప్పాల్సివచ్చినప్పుడు మాత్రమే యీసంజ్ఞల్ని ఉపయోగిస్తాడు. అందుచేత యీ "సైగలభాష"ను "ధ్వనులభాష"తో ఏరకంగానూ పోల్చడానికి వీల్లేదు. పురాతనకాలపు కొయ్యనాగలిని ఆధునిక కాలపు ట్రాక్టరుతో పోల్చడం ఎలా సాధ్యం కాదో, అలాగే యిదికూడా సాధ్యంకాదు.

3. ఆట్టేచూస్తే మీకు మాట్లాడలేని చెవిటి, మూగవాళ్ళమీదే భాషాశాస్త్రంకన్నా ఎక్కువ అభిరుచిఉన్నట్లు కన్పడుతోంది. అందుచేతనే నాకు యిలాంటి ప్రశ్నలుపంపారు. మీరు గట్టిగా పట్టుపడితే, మీరడిగిన దానికి సమాధానం చెప్పకుండా వుండలేను. చెవిటి, మూగ వాళ్ళవిషయం చూద్దాం. వాళ్ళ మేధస్సు పని చేస్తుందా? వాళ్ళకు ఆలోచనలుంటాయా? తప్పకుండా ఉంటాయి, వాళ్ళమేధస్సు పనిచేస్తుంది మూగవాళ్ళకు నాలుక లేదుకాబట్టి, భాషాసంపదపై ఆధారపడి వాళ్ళ ఆలోచనలుండవు. అంటే దీనిఅర్థం మూగవాళ్లు ప్రకృతిసూత్రాలకు విరుద్ధంగా "ఉత్త అభిప్రాయాలు" ఏర్పర్చుకుంటా

రనా? ఎన్నటికీకాదు. మూగవాళ్ళ ఆలోచనలు వాళ్ళుచూచే చిత్రాలపైనా, పొందే స్పర్శవల్లా, దైనందిన జీవితంలో వాళ్ళే ర్పర్చుకొనే అభిప్రాయాలవల్లా యేర్పడతాయి. దృష్టి, స్పర్శ, రుచి, వాసనలద్వారా మానవులతో వాళ్ళకున్న సంబంధాన్ని బట్టి వాళ్ళకు ఆలోచన లేర్పడతాయి. ఇంతకుమినహా, మరో విధమైన ఆలోచన అనేది లేనేలేదు.

కామ్రేడ్ ఎ. ఖోలపావ్‌కు :

మీావుత్తరం అందింది. పనివత్తిడివల్ల ఎక్కువ విపులంగా వ్రాయలేకపోతున్నాను. మీాజాబు రెండువిషయాలపై ఆధార పడి వ్రాసినట్లుంది. ఒక గ్రంథకర్త ఒక చారిత్రిక సమయంలో వ్రాసిన విషయాన్ని ఆ చారిత్రికసమయానికి సంబంధించని సమయాల్లో కూడా ఉల్లేఖించవచ్చును. 2. చారిత్రికాభి వృద్ధిలో సమకూర్చబడిన మార్క్సిస్టు సూత్రాలు అన్ని కాలాలకూ ఉపయోగపడతాయి. వాటిని మార్చడానికి వీల్లేదు.

మీారు చెప్పిన యీా రెండువిషయాలూ తప్పే. కొన్ని ఉదాహరణలు చూద్దాం.

1. క్రిందటిశతాబ్దపు నాల్గోదశాబ్దంలో గుత్త పెట్టుబడి దారీవిధానం యింకా అభివృద్ధికాలేదు. పెట్టుబడిదారీవిధానం తాపీగా అభివృద్ధి అవుతున్నరోజులవి. కొత్తప్రాంతాలకుకూడా అప్పుడే పాకుతోంది. పెట్టుబడిదారీ విధానంలోని 'అసమాన అభివృద్ధిసూత్రం' యింకా స్పష్టంగా బయటపడలా. అందుచేత మార్క్సు, ఎంగిల్సులు సోషలిస్టువిప్లవం విజయం పొందాలంటే అన్నిదేశాలూ కలిసి, ఒకేసారి పెట్టుబడిదారీవిధానంపై దెబ్బ

కొట్టాలని చెప్పారు. ఈ నిర్ణయం మార్క్సిస్టుల కందరికీ ఒక మార్గంచూపే సూత్రంగా తయారైంది.

కాని, 20వ శతాబ్దపు మొదటిరోజుల్లో, ముఖ్యంగా మొదటి ప్రపంచపు యుద్ధకాలంలో పెట్టుబడిదారీవిధానం, గుత్త పెట్టుబడిదారీ విధానంగా తయారైంది. అభివృద్ధిపొందే పెట్టుబడిదారీవిధానం క్షీణించిపోయే పెట్టుబడిదారీ విధానంగా తయారైంది. మొదటి ప్రపంచయుద్ధం ప్రపంచసామ్రాజ్యవాద రంగంలోని బలహీనతల నన్నిటినీ బయటపెట్టింది. పెట్టుబడి దారీ విధానంలోని అసమాన అభివృద్ధివలన వివిధ దేశాల్లో, వివిధ సమయాల్లో సోషలిస్టు విప్లవం విజయంపొందే అవకాశం ఏర్పడింది. ఈ నూతన అభివృద్ధిని దృష్టిలో పెట్టుకుని లెనిన్ మార్క్సిస్టు సూత్రాల నన్వయించి ఒకే దేశంలో సోషలిస్టు విప్లవం విజయం పొందడానికి అవకాశమున్నదనీ, అన్నిదేశాల్లోనూ, లేక చాలా ఎక్కువ దేశాల్లోనూ ఒకేసారి విజయం పొందడం సాధ్యపడదనీ స్పష్టంచేశాడు. వివిధదేశాల్లో వివిధ సమయాల్లో విప్లవం పరిపక్వత పొందడంవల్ల నూతన చారిత్రిక పరిస్థితుల్లో మార్క్స్, ఎంగెల్సుల సూత్రం అన్వయించదని స్పష్టపర్చాడు.

సోషలిస్టువిప్లవవిజయం విషయంలో, యిక్కడ, మనం రెండుసూత్రాలు చూస్తున్నాం. ఈ రెండూ ఒకదానికొకటి విరుద్ధమైనవి. ఒకదానినొకటి తోసివేస్తున్నది.

ఏ సమయంలో, ఏ పరిస్థితుల్లో యీ విషయాలు చెప్పబడ్డాయో తెలుసుకోలేని చాదస్తులు కొంతమంది యీ రెండింటిలో యేదోఒకటి తప్పయి వుంటుందని అనుకోవచ్చు. అందుచేత, ఆ రెంటిలో ఒకదాన్ని తోసేసి, రెండోదాన్ని

సర్వకాల, సర్వావస్థల్లోనూ ఉపయోగించాలని వాదిస్తున్నారు. కాని, యీ చాదస్తులు తప్పుగా వాదిస్తున్నారని మార్క్సిస్టుల కందరికీ తెలుసు. ఈ రెండు నిర్ణయాలుకూడా సరైనవే. కాని ఒక షరతుపైన మాత్రమే. మార్క్సు, ఎంగిల్సులు చేసిన నిర్ణయం గుత్తపెట్టుబడిదారీ విధానం అభివృద్ధికాని రోజులను పనికివచ్చేది. లెనిన్ నిర్ణయం గుత్తపెట్టుబడిదారీ విధానం అమల్లో వున్నప్పుడు పనికివచ్చేది.

2. ఎంగిల్సు "యాంటీడూరింగ్"లో ఒక విషయం చెప్పాడు. సోషలిస్టువిప్లవానంతరం రాజ్యాంగయంత్రం కృశించిపోతుందన్నాడు. మనదేశంలో సోషలిస్టువిప్లవం విజయంపొందగానే, మన పార్టీలోని చాదస్తులు ఎంగిల్సు చెప్పినదాన్ని ఆధారం చేసుకొని, రాజ్యాంగయంత్రం కృశించిపోవడానికి పార్టీ తగినచర్యలు తీసుకోవాలనీ, పరిపాలక యంత్రాన్ని రద్దుచేయాలనీ, సైన్యాన్ని రద్దుచేయాలనీ వాదించడం మొదలుపెట్టారు.

కాని, అప్పటి అంతర్జాతీయ పరిస్థితిని దృష్టిలో పెట్టుకొని, సోవియట్ మార్క్సిస్టులు యీ వాదనను అంగీకరించలేదు. కారణమేమంటే సోషలిస్టు విప్లవం ఒకే ఒక దేశంలో విజయవంతమైనప్పుడు, ఆ దేశం చుట్టూ పెట్టుబడిదారీ ప్రభుత్వాలు పరిపాలన సాగిస్తున్నప్పుడు, సోషలిస్టుదేశాన్ని ఏ విధంగానూ బలహీనపర్చకూడదు. సోవియట్ రాజ్యాంగ యంత్రాన్నీ, పరిపాలనా సంస్థల్నీ, గూఢచారి యంత్రాన్నీ, సైన్యాన్నీ, యింకా బలపర్చుకోవాలి. సోషలిస్టుదేశం నాశనం చేయబడకుండా ఉండాలంటే చేయవలసినపని యిదే. ఎంగిల్సు చెప్పినసూత్రం అన్నిదేశాల్లోనూ సోషలిజం విజయవంతమై

నప్పుడే అన్వయిస్తుందికాని, ఒకే ఒక దేశంలో సోషలిజం విజయంపొంది, చుట్టూ పెట్టుబడిదారీదేశాలు ఉన్నప్పుడు అన్వయించదని రష్యన్ మార్క్సిస్టులు నిర్ణయించుకున్నారు.

సోషలిస్టురాజ్యాంగ యంత్రాన్నిగురించి మనం యిక్కడ రెండు సూత్రాల్ని చూస్తున్నాం. ఇందులో ఒకటి మరోదాన్ని తోసివేస్తోంది.

దీన్ని పట్టుకొని మన చాదస్తులు కొంతమంది యీ రెండుసూత్రాల్లో ఏదోఒకటి తప్పనీ వీటిలో ఒకదాన్ని తోసేసి రెండోదాన్ని సర్వకాలసర్వావస్థల్లోనూ, అన్వయించాలనీ చెబుతారు. కాని యీ చాదస్తులు తప్పుదారిని పోతున్నారని మార్క్సిస్టులంతా తెలుసుకోవాలి. ఎందువల్లనంటే; యీ రెండు సూత్రాలూ సరైనవే. కాని, అన్ని సమయాల్లోనూ, అన్ని పరిస్థితుల్లోనూ కాదు. ఏ కాలమానపరిస్థితుల్లో ఆ సూత్రం చెప్పబడిందో ఆ కాలమాన పరిస్థితులకు అది సరైనదే. ఒకే ఒకదేశంలో సోషలిజం విజయం పొందినప్పుడు సోవియట్ మార్క్సిస్టులు చెప్పినసూత్రం సరైనదౌతుంది. చాల ఎక్కువదేశాల్లోగాని, లేక అన్నిదేశాల్లోనూ గాని సోషలిజం విజయం పొందినప్పుడు ఎంగిల్సు చెప్పిన సూత్రం సరైనదౌతుంది.

ఇలాగే ఎన్నైనా ఉదాహరణ లివ్వవచ్చు.

భాషాసమస్యపై స్టాలిన్ యిచ్చిన వివిధ వివరణలపై కామ్రేడ్ "ఖోలపావ్" వ్రాసిన వుత్తరంకూడా యీ శ్రేణికి చెందినదే.

"భాషాశాస్త్రం - మార్క్సిజం" అన్న పుస్తకంలో స్టాలిన్ యిచ్చిన వివరణను "ఖోలపావ్" యీ సందర్భంలో ఉదహరిస్తున్నాడు. రెండుభాషలు సంకరమైనప్పుడు అందులో ఒక భాషయే విజయవంతంగా బయటపడుతుంది. రెండవది నశించిపోతుంది. అంతేకాని, యీ సంకరంవల్ల మరో భాష ఉద్భవించదు. ఆ రెండుభాషల్లోనూ ఒకటి మాత్రమే యీసంకరంవల్ల మిగులుతుంది. "భాషాశాస్త్రం-మార్క్సిజం" అన్న పుస్తకంలో స్టాలిన్ చెప్పింది యిదే. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 16 వ కాంగ్రెసుకు రిపోర్టుయిస్తూ స్టాలిన్ మరోవిధంగా చెప్పాడంటున్నాడు "ఖోలపావ్". ఆ రిపోర్టులో ఉన్నది యిది :- ప్రపంచవ్యాపితంగా సోషలిజం విజయం పొందినపుడు, సోషలిజం బలాన్ని సమకూర్చుకొని ప్రజల దైనందిన జీవితంలో ఒక భాగమైనప్పుడు, వివిధ జాతీయ భాషలూ సంకరమై మరో నూతనభాష ఉద్భవిస్తుందనీ, రష్యన్ భాష, జర్మన్ భాష గాక, మరొక కొత్తభాష తయారౌతుందనీ చెప్పబడింది. ఖోలపావ్ యీ రెండు సూత్రాలనూ పోల్చాడు కాని, ఒకదాంతో ఒకటి ఏకీభవించడంలేదు. ఒకదాని కొకటి చుక్కెదురుగా కన్పడుతోంది. దీంతో ఖోలపావ్ గాభరా పడ్డాడు. ఈ రెండు సూత్రాలనుగురించీ ఖోలపావ్ తన ఉత్తరంలో యిలా వ్రాశాడు: "భాషాశాస్త్రం - మార్క్సిజం" అన్న పుస్తకంలో రెండుభాషల సంకరంవల్ల మూడోభాష పుద్భవించదని మీరు వ్రాశారు. కాని, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 16 వ కాంగ్రెసులో యిచ్చిన రిపోర్టులో, కమ్యూనిస్టు సమాజంలో వివిధభాషలూ సంకరమై, మరో కొత్తభాషగా

తయారౌతాయని చెప్పారు. ఈ రెండో సూత్రమే నాకు బాగ నచ్చింది"

ఈ రెండుసూత్రాల్లోవున్న వైరుధ్యాన్ని ఖోలపావ్ కనిపెట్టి, ఈ రెంటిమధ్యా వున్నవైరుధ్యాన్ని తగ్గించాలను కున్నాడు. అందుకోసం యీరెండింటిలోనూ ఒకసూత్రాన్ని తప్పొతోసేసి, రెండోదాన్ని పట్టుకు వ్రేళ్ళాడాలనుకుంటు న్నాడు. కాని, యే సూత్రం సరైనదో తెలియక గిజగిజలాడు తున్నాడు. ఏ యే సమయాలను ఉద్దేశింపబడి యీ సూత్రాలు చెప్పబడినవో, ఆయాసమయాలకు యీ సూత్రాలు సరైనవే నని మాత్రం కామ్రేడ్ ఖోలపావ్ తెలుసుకోలేక పోయాడు. అసలు వాస్తవికవిషయాలనుచూస్తే, ఖోలపావ్ బయటపడ గల్గుతాడు. "భాషాశాస్త్రం-మార్క్సిజం" అన్న పుస్తకంలో యిచ్చిన సూత్రమూ, 16 వ కాంగ్రెసుకిచ్చిన రిపోర్టులోవున్న సూత్రమూ రెండూ రెండుయుగాలకు సంబంధించినవి. అందు కనే రెండురకాల సూత్రాలు చెప్పవలసి వచ్చింది.

"భాషాశాస్త్రం - మార్క్సిజం" అన్న పుస్తకంలో యిచ్చిన సూత్రం ప్రపంచవ్యాపితంగా సోషలిజం విజయం పొందని రోజుల్లోనూ, దోపిడీచేసే వర్గాలు యింకా అధి కారంలోవున్న రోజుల్లోనూ, మన జాతీయదోపిడీ సాగుతూన్న రోజుల్లోనూ, వివిధజాతులమధ్య తగాదాలు నడుస్తూ ఒక జాతిపై మరోజాతి పెత్తనం చేసేరోజుల్లోనూ, వివిధజాతుల మధ్య సమానత్వంలేని రోజుల్లోనూ అన్వయిస్తుంది. కారణ మేమంటే, అటువంటి సమయంలో, ఒకజాతిపై యింకోజాతి పెత్తనం చేయడానికి పూనుకున్నప్పుడే రెండుబాషల సంకర మనేది జరుగుతుంది. వివిధజాతులమధ్య శాంతియుత సహకార

సంబంధాలుండవు. అందుచేత కొన్ని భాషలు నలిగిపోతాయి. కొన్ని పైకివస్తాయి. ఆ పరిస్థితుల్లో ఓడిపోయినభాషలు, గెలిచిన భాషలుమాత్రమే వుండగలవు. పై పరిస్థితుల్ని దృష్టిలో పెట్టుకునే రెండుభాషలు సంకరమైనప్పుడు మూడోభాష ఉద్భవించదని, అందులో ఒకటి నాశనంచేయబడి, రెండోది విజయంపొందుతుందని స్టాలిన్ తన పుస్తకంలో వ్రాశాడు.

ఇక స్టాలిన్ 16 వ కాంగ్రెసులో యిచ్చిన రెండో సూత్రాన్ని చూద్దాం. వివిధభాషల సంకరంవల్ల కొత్త భాష ఉద్భవిస్తుందని ఆ సూత్రం చెబుతున్నది. ఈ సూత్రం సోషలిస్టుయుగానికి అన్వయించేది. అంటే ప్రపంచవ్యాపితంగా సోషలిజం విజయంపొందినప్పుడు, ప్రపంచ సామ్రాజ్యవాదం పూర్తిగా నాశనంచేయబడినప్పుడు, దోపిడీచేసే వర్గాలు కూలద్రోయబడ్డప్పుడు, జాతీయవలస దోపిడీవిధానం తుడిచివేయబడ్డప్పుడు, వివిధజాతులమధ్య తగాదాలకు, దోపిడీలకు బదులు సహకార సంబంధాలు ఏర్పడినప్పుడు జాతుల సమానత్వాన్ని అమలుపర్చినప్పుడు, కొన్ని భాషల్ని తొక్కివేయడం అనేవిధానం నాశనం చేయబడ్డప్పుడు, వివిధజాతుల మధ్య సహకారం సౌమ్యంగా సాగుతున్నప్పుడు యీసూత్రం అన్వయిస్తుంది. అటువంటి పరిస్థితుల్లో ఒకభాష మరోభాషకు సహాయంచేస్తూ, ఒకదాన్నిబట్టి రెండోది పెంపొందుతుంది. అంతేగాని, అప్పుడు కొన్నిభాషలు నాశనం చేయబడటమనేది, కొన్ని భాషలు విజయంపొందటమనేది లేనేలేదు. అప్పుడు రెండుభాషల సంకరమన్న సమస్యగానీ, ఒకటి నాశనం చేయబడి మరొకటి గెలవడమన్న సమస్యగానీరాదు. అప్పుడు వందలకొలది జాతీయభాషలు సంకరమౌతాయి. వివిధజాతుల

మధ్య దీర్ఘకాల ఆర్థిక రాజకీయ, వైజ్ఞానిక సహకారం కొన సాగుతుంది. తద్వారా ఖండాలవారీగా కొన్ని జోనల్ భాషలు యేర్పడతాయి. వాటినుండి ఒకేఒక అంతర్జాతీయ భాష ఏర్పడుతుంది. అది జర్మన్ భాషాకాదు; రష్యన్ భాషా కాదు; ఇంగ్లీషుభాషాకాదు. వివిధ జాతీయ జోనల్ భాషలలోని మంచి నంతటినీ జీర్ణించుకున్న ఒక నూతన అంతర్జాతీయభాష ఉద్భవిస్తుంది.

కాబట్టి యీ రెండుసూత్రాలూ రెండు యుగాలకు సంబంధించినవి. ఆయాయుగాలకు ఆసూత్రాలు సరైనవి కూడాను.

ఈ రెండుసూత్రాలూ ఒకదాంతో ఒకటి భేదించ కుండా వుండాలనీ, ఒకదానినొకటి తోసెయ్యకుండా వుండా లనీ వాదించడం అర్థంలేనివిషయం. ఇది ఎలావుంటుందంటే పెట్టుబడిదారీ సమాజానికీ, సోషలిస్టు సమాజానికీ భేదం ఉండకూడదనీ, సోషలిస్టు సమాజం పెట్టుబడిదారీ సమాజాన్ని తోసిపారవేయకూడదనీ వాదించినట్టుగా వుంటుంది.

మార్క్సిజాన్ని, వివిధ మార్క్సిస్టు సూత్రాలనూ, చాదస్తులు, ఎన్నడూ మారని చాదస్తాలసంపుటిగా మాత్రమే చూస్తారు. సమాజపరిస్థితుల్లో మార్పువచ్చినా ఆ చాదస్తాలను పట్టుకొనే వ్రేళ్లాడాలంటారు.

మార్క్సిస్టు సూత్రాలన్నిటినీ కంఠోపాఠం పడితే, వరుసావావీ లేకుండా ఆ సూత్రాలను అన్ని కాలాలలోనూ, అన్ని దేశాలకూ అన్వయించవచ్చునని యిటువంటి చాదస్తులు ఊహిస్తారు. తాము చదివేదేమిటో అర్థంచేసుకోలేని

మార్క్సిస్టు సూత్రాల బట్టీరాయుళ్ళు మాత్రమే యిటువంటి చాదస్తానికి లోనౌతారు.

ప్రకృతియొక్క, మానవ సమాజంయొక్క అభివృద్ధి సూత్రాలను చెప్పే శాస్త్రమే మార్క్సిజం. దోపిడీ చేయబడే ప్రజల విప్లవశాస్త్రమే మార్క్సిజం. అన్ని దేశాలలోనూ సోషలిజానికి విజయం సాధించి, కమ్యూనిస్టుసమాజాన్ని స్థాపన జేసే శాస్త్రమే మార్క్సిజం. మార్క్సిజం ఒక శాస్త్రంగా అభివృద్ధిపొందకుండా ఆగిపోదు. అభివృద్ధిపొందుతుంది. నూతన అనుభవాలతోనూ, నూతన విజ్ఞానంతోనూ యింకా ఉన్నత స్థాయిని అందుకొంటుంది. కాలంగడచినకొద్దీ, పరిస్థితులు మారినపుడు నూతన చారిత్రికపరిస్థితుల కనుగుణంగా పాత సూత్రాలను వదలివేసి, కొత్త సూత్రాలను ప్రవేశపెట్టవలసి వస్తుంది. ఎప్పుడూ మారని సూత్రాలు, నిర్ణయాలు వుంటాయనీ, అవి సర్వకాల సర్వావస్థలలోనూ అన్వయిస్తాయనీ మార్క్సిజం అంగీకరించదు. మార్క్సిజం చాదస్తానికి పరమ శత్రువు.

★

# వివరణ

| | | |
|---|---|---|
| అపభ్రంశమైన భాష | — | Jargon |
| కట్టడం | — | Superstructure |
| గణాలు | — | Clans |
| గ్రహణశక్తి | — | Cognition |
| చాతుర్లక్షణ పరిశీలన | — | Four Elements Analysis |
| జాతులు | — | Nationalities |
| జాతీయ భాషలు | — | National Languages |
| జాతీయ స్వరూపం | — | Nationalist in form |
| తట్టబేరగాడి కేకల్లాంటి అపభ్రంశభాష | | Huckster Jargon |
| తెగలు | — | Tribes |
| పదపరిచ్ఛేదం | — | Rules of inflexion |
| పదాల కూర్పును నిర్ణయించే సూత్రాలు | — | Morphology, Syntax |
| పదప్రయోగం | — | Expression |
| పునాది | — | Foundation |
| ప్రతిపాదన | — | Thesis |
| ప్రత్యేక అలవాట్లు | — | Mannerisms |
| ప్రాంతీయ ఉచ్చారణలు | — | Local Tongues |
| భాషలు సంకరమౌతాయనే సిద్ధాంతము | — | Theory of crossing of Languages |
| మాండలికాలు | — | Dialects |
| మూల పదసంపద | — | Fundamental word Fund, Basic word Fund |

| | |
|---|---|
| మోటు పద ప్రయోగాలు — | Vulgar Expressions |
| యాస — | Accent |
| వదరుబోతులు — | Wind Bags |
| విలాసగృహం — | Salon |
| శబ్దార్థశాస్త్రం (అంటే మాటల అర్థం ఎలా మారుతూ వచ్చిందో తెలియ పర్చే శాస్త్రం) — | Semantics Semasiology |
| శైలీగతిశాస్త్రం — | Stylistics |
| సామాజిక దృగ్విషయం — | Social Phenomina |
| సూత్రం — | Formula |
| సోషలిస్టు స్వభావం — | Socialist in content |



68



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA128B122 |
|---|---|
| పుస్తకం పేరు | భాషాశాస్త్రము |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | n/o |
| వెనుక అట్ట | n/o |
| మొత్తం పేజీలు | 73 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 66 |
| లేని పేజీలు | n/o |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | pratyusha |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |